# సూక్ష్మంలో మోక్షం

బొల్లిముంత శివరామకృష్ణ

…యుగ పబ్లిషింగ్ హౌస్, గుంటూరు.

— ''వ్యంగ్య రచనలు ... శత్రువుల గుట్లును బట్టబయలు చేయడానికి ఉపయోగించే ఒక పద్ధతి ... నిరంకుశ పరిపాలన దినాల్లో వాక్ స్వాతంత్ర్యం వుండదు ... అందుచేత వ్యంగ్యంతో కూడిన రచనలతో నిరంకుశ వ్యతిరేక పోరాటం సాగించటం సరైనపద్ధతే—''

మావ్-సే-టుంగ్.

# సూక్ష్మంలో మోక్షం

## ( వ్యంగ్య రచనలు )

బొల్లిముంత శివరామకృష్ణ



నవయుగ పబ్లిషింగ్ హౌస్
గుంటూరు.

# మోక్షంలో సూక్ష్మం

"A book cannot be a book without an Inlro duction" అన్నాడు వెనుకటి కో ఇంగ్లీషు రచయిత.

పుస్తకం కాకుండాపోతుందనే కాబోలు. అను కోకుండానే పైగా పీఠికో, తొలిపలుకో అలాంటివేవీ లేకుండానే వుంచుదామనుకొంటే తద్వ్యతిరేకంగాకూడా యిది వ్రాయాల్సివస్తోంది.

మనం వ్రాసినవేవో ఎలాగు పాఠకులముందు వుంచుతున్నాం. చదవదలచుకొన్నవారెలాగూ కొనిగానీ కొనకగానీ చదవనే చదువుతారు. ఇక తొలిపలుకో పీఠికో అనేపేరుతో ఏతత్ పుస్తకంలో ఇదివున్నదీ అదివున్నదీ అంటూ 'ధరస్వల్పం ఫలమధికం' లాగా దండకం ఎందుకు చదవాలి? ఇది కొన్నవాళ్లెలాగూ కొననే కొన్నారు. కొన్నతర్వాత లేక ఎరువుతెచ్చుకొన్నతర్వాత ఎలాగూ చదవడం ప్రారంభిస్తారు. పూర్తిచేయడం మాటా? అది మనపుస్తకంలోని సత్తానిబట్టివుంటుంది. చదవ బుద్ధిపుట్టిస్తే ముందుకుపోతారు. లేకపోతే—పుస్తకం మూసేసి, కాక విసిరేసి కళ్లుమూస్తారు. మరీ బాధా

కరంగావుంటే తలనొప్పి నివారణకు మార్గాలు వెతుక్కుంటారు.

మా మట్టుకు మేం — వ్రాసిన నేనూ ప్రచురించిన మిత్రులూ యిద్దరం కూడా యివి బాగావున్నయనీ వీటివల్ల సాంఘికప్రయోజనంవుంటుందనే ఈ పుస్తకాన్ని ప్రచురించి పాఠకలోకానికి సమర్పించుకొంటున్నాం. బాగుండలేదనే అనుకొంటే ఇంతటి అఘాయిత్యానికి ఎలాగూ ఒడిగట్టం. కనుక బాగును గురించి చెప్పవలసిందేమీ లేదు.

పోతే యింతవరకూవస్తూన్న అన్నిపీఠికలూ, తొలి, తుదిపలుకులుకూడా స్వంతంగా ఆత్మస్తుతిచేసుకోడమో అంత మొగమోటస్తుడైతే ఆపనికాస్తా పరులచేత చేయించుకోడమో సాంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని వదలుకొందామంటే వీలుచిక్కిందేకాదు.

మా యిష్టానిష్టాలతో సంబంధంలేకుండానే పుస్తకానికిముందు కొన్ని పేజీలు యీ సాంప్రదాయానికి మినహాయించిమరీ పుస్తకం పూర్తిచేశారు. మరిప్పుడు ఆ పేజీలు ఎలా నింపడం? యిదో సమస్య.

పోనీ పుస్తకంలో ఎలాగు అచ్చుతప్పులంటూ 8 పేజీలకు మించేవుండటం సాంప్రదాయం. ఆ 8 పేజీలూ తప్పొప్పుల పట్టికతోనింపివేస్తే?

“అయ్యవార్లంగారేమి చేస్తున్నారయ్యాఅంటే చేసినతప్పులు దిద్దుకొంటున్నారన్నట్టు పుస్తకం మొదట్లోనే 8 పేజీల భారతమా? ఎబ్బెబ్బే ”

కనుక ఏదో ఒకటి వ్రాయాలి. అంటే అది ఆత్మస్తుతో, పరనిందో, తొలిపలుకో అయివుండితీరాలి.

ఎందుకొచ్చిన బాధ. ఏదో ఒకటి వ్రాసే తీరదాం. ఎందుకైనా మంచిది.

An Introduction adds weight to a book అనీ — కనీసం ఏ చదువరైనా తిరిగి అమ్ముకొనే తీరాలంటే తూకానికేనా రావొద్దూ?

‘కనుక ఏదో ఒకటి వ్రాయాల్సిందే.’ అని కూర్చుంటే వ్రాయడానికేమీ కనిపించదు. మరి—

---

## మచ్చుకో అచ్చు తప్పు.

86 పేజీ 2-వ పేరాలో

‘బొర్ర సవిరించాడు, ఆ చేత్తోనే బుర్రా సవిరించాడు.’ అని వుండాలి.

ఇందులో

# నాయక దేవతా ప్రీత్యర్థం

ఆ నాడు వేటకోసం పోరుకాడినా, ఈ నాడు వేటకోసం పోరుకాడుతున్నా, నానాటికీ వేటి వేటి కోసం జారుతూ, మారుతూ పోతున్నా —

అదంతా – అప్రస్తుత ప్రసంగ సంపుటాలల్లో అవసర అధ్యాయాలు.

ఇదంతా – ఆపద్ధర్మసూత్రాలూ, అవసాన కాల స్తోత్రాలూ, అవలంబించవలసిన అమూల్య తరుణం. తెగించి జారవలసినా, తేరాశతో కోరవలసినా అత్యవసర సమయం.

అందుకే – యీ ప్రార్థనా పదాలు ప్రతి వాడూ భట్టీయం వెయ్యడం, పారాయణం చెయ్యడం ప్రస్తుతం ప్రధానం.

ఓం

'సంకుచిత వాదులం' అన్న సన్యాసి బిరుదు మాకు వదిలేందుకూ; మాలో కూడా విశాల విశ్వ తత్వం, దేశభక్తీ మణుగులకు మణుగులు కద్దని రుజువ య్యేందుకూ; వీలుగా – రానివాటికోసం రభస రభస చెయ్యకుండేట్టూ, వచ్చిందేదేనా వల్లకాట్లోకి చేరు తున్నా గుడ్లు వప్పగించి వూరుకునేట్టూ —

శ్రీ శ్రీ ఆషాఢభూతీ నాయకంగారూ !

మీ సంచార యాత్రల్తో ఉపన్యాస తీర్థాలతో మమ్మల్ని ఉక్కిరి బిక్కిరి చేసెయ్యండీ!...

— ఆమెన్ —

న

ఎన్నేళ్లకూ పాతపడని సరికొత్త స్వరాజ్యం గారూ !

మా – చాలీ చాలని జీతాలనీ, దొరకనే దొరకని వుద్యోగాలనీ, పనికిమాలిన చదువుల్నీ, భార మైన బతుకుల్నీ, దూరమైన ఆశల్నీ, పరిగలాగా పల్చ పల్చగావున్న పదవులు మినహా సర్వస్వాన్నీ, ఇలాగే– యిలాగే వుండేటట్టు.

ఎంతకూ రోజులు చాలని శ్రీ స్వతంత్ర ప్రభుత్వంగారూ !

మీ నిత్యనూతనత్వంకోసం, మీపదవీ భద్రత కోసం - మా యీ అద్వితీయ బలిదానం అనంతంగా అవిఘ్నంగా సాగిపోయేట్టు ఆశీర్వదించండీ! ......

— ఆమేన్ —

మః

నిజాన్ని బుట్టలోకీ, అబద్ధాన్ని అచ్చులోకీ నెట్టేందుకూ; ఉన్నవాళ్ళ దోపిడీని లేనివాళ్ళ త్యాగంగా జమ పెట్టేందుకూ; ఫాసిజానికి ప్రజాస్వామికపు చీర కట్టేందుకూ; ప్రజాస్వామికం తలకు నియంతృత్వ కోకలి చుట్టేందుకూ; అన్ని అఘాయిత్యాలకూ చిక్కటి సిల్కు తెరఅడ్డంగా పట్టేందుకూ -

శ్రీ శ్రీ డబ్బుకక్కుర్తిగారూ!

పదికాలాలపాటు మా పత్రికలకు ప్రకటనలు పరామర్శలు ప్రసాదించండీ! ......

— ఆమేన్ —

శి

పన్నుల్నీ, మిలటరీబూటు తన్నుల్నీ, ప్రజా రక్షణ చట్టపు కన్నుల్నీ, వెన్నుల్లోదూరే సన్నీల్నీ; అన్నిటినీ యిక అన్నేళ్ళైనా భరించేందుకు -

శ్రీ గాంధీనామ జపంగారూ!

మా నర నరానా వాతాపిజీర్ణంఐపోండీ!

— ఆమేన్ —

## వా

కాల్చే యిళ్ళనీ, దోచే వూళ్ళనీ, చేసే హత్యల్నీ చెరిపే మానాల్నీ, పెరిగే రాక్షసత్వాన్నీ, తరిగే మానవత్వాన్నీ -

శ్రీ శ్రీ పాపాల భైరవుడుగారూ!

కమ్యూనిస్టు బూచి ముసుగులో పెట్టి కప్పెయ్యండీ!

— ఆమెన్ —

## యః

చెప్పేవి చెయ్యకుండేందుకూ. చేసేవి చెప్ప కుండేందుకూ, ఏరుదాటి తెప్ప తగలేసేందుకూ, ఏడ్చి చంక కెక్కేందుకూ, మానాభిమానాలు మర్చిపోయ్యేం దుకూ —

శ్రీ శ్రీ ముసలితనపు పాపపుణ్యంగారూ!

ఆ చేరిడుమార్కు మొగమొగానా గుద్ది వేసేందుకు ఓ శాసనం చేయించండీ!...

ఆమెన్ —

శ్రీ శ్రీ కి కృతజ్ఞతతో. 30-3-49.

# దేశం ఏంకావాలి ?

చక్రపాణి రెండు సంవత్సరాల తర్వాత తిరిగి యీనాడు బాహ్య ప్రపంచంలో కాలుబెట్టాడు. జైలు జీవితం అతని ఆరోగ్యాన్ని పూర్తిగా తినేసింది. బాగా పరిచయం వున్న వాళ్ళకే అతణ్ణి గుర్తుబట్టడం కష్ట మయ్యేట్టుంది.

ఆ స్టేషనులో దిగిందల్లా తానొక్కడే. స్టేషన్ మాస్టరుకు టిక్కెట్టిచ్చి, కూజాలోని కొంచం మంచినీళ్ళ డిగి పుచ్చుకొని, బల్లమీద కూచున్నాడు, — ఆకాశాన దూరంగా ఎగుర్తోన్న గ్రద్దల్ని చూస్తూ, ప్రక్క బీట్లో అరుస్తున్న ప్రత్తిరాటపు పిట్టలగోల వింటూ.

స్టేషన్ మాష్టరు తాళంవేసి, లాగిచూచి, తాళంచేతులు త్రిప్పుకుంటూ వెళ్ళిపోయాడు. ఇంకా రెండు మైళ్ళు నడిస్తేనేగాని తాను కొంప చేరలేడు. నెమ్మదిగా లేచి రైలు కట్టవెంటే బయల్దేరాడు, పాణి ఏవేవో మధుర స్వప్నాల నూహించుకుంటూ -

కొంతదూరం నడిచేసరికల్లా కాంగ్రెసు జండాలు గాలిలో రెప రెప లాడుతూ ఎదురు వస్తూ న్నాయి.

వెనక తానుపాల్గొన్న సహాయనిరాకరణోద్యమం బుర్రలో తళుక్కుమంది. ఇలానే బయలుదేరి పికెటింగు చేస్తూ వుండేవాళ్ళు. ఒక్కసారిగా అతని కళ్ళ ముందర కల్లు దుకాణాలు, విదేశీ వస్త్రాలయాలు, కాంగ్రెసు శిబిరం, లాఠీచార్జీలు, అధికారుల వెకిలి నవ్వులు, యింకా యింకా ఎన్నో - గిర్రున తిరిగి పోసాగినయ్.

ఆ గుంపు దగ్గరౌతున్నకొద్దీ అతని మనస్సులో కొట్లాట బయలుదేరింది. ఎంత మార్పు!

కాంగ్రెస్ ఉద్యమాన్ని ఆ గ్రామంలో కాలు పెట్టకుండా చేశాడన్న ప్రఖ్యాతితో, పన్నుగర్రి సంపాయించుకున్న ప్రక్కవూరి మునసబుగారు మొట్ట మొదటగా కనబడ్డాడు.

గుంపు యింకా దగ్గరైంది. "చక్రపాణికి జై" "గాంధీకి జై" అన్న నినాదాలు చెవుల్లో గింగురెత్తినయ్. పూలమాలల్తో మెడా, బిడియంతో తలా వంగిపోయి, పూలవాసనను అధిగమిస్తూ కొత్త ఖద్దరు వాసన నాసికా పుటాల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. అంతా తన వూరి వాళ్ళే. వీళ్ళంతా కాంగ్రెస్ ఉద్యమాన్ని యిలా బలపరుస్తారని తాను కలలోకూడా ఊహించలేదు.

అసలిది నిజమా? కలా? - యిదేదో క్రొత్త

ప్రపంచంలాగావుంది. తనలాంటి క్షుద్రజీవికి-అందులోనూ స్వంత వూరివాళ్ళు స్వాగతమివ్వడం -

తనయింటిమీద కట్టుకున్న జెండానుముమ్మారు లాక్కు-పోయి తగలెట్టిన రాడీ వెంకయ్యభుజాన కాంగ్రెసు జండా! ఉద్యమ ప్రభావం -

అంతా తిరిగి ఊరువేపు నడుస్తున్నారు.

"పాణిబాబూ! చాలా చిక్కి-పోయావు. సర్కా-ర్లోళ్లు మనదేశాన్ని పీల్చుకుతింటమే గాకుండా, నీబోటి కుర్రాళ్ల రక్తాన్నికూడా పీల్చుకు తింటున్నట్టు న్నారే?"— అన్నాడు షావుకారు నారయ్య.

క్రిందటిసారి తాను జైలుకి వెళ్లినప్పుడు యింట్లో తిండికి గింజలు లేక తన తల్లిపోయి యీ నారయ్యనే అప్పు అడిగితే-

"కొడుకు పోయాడుగా సరాజ్యం చెయ్య డానికి. వచ్చేదాకా ఉపోసాలుంటే, ఈ వార ఆవార సరాజ్యంలో ఎక్కు-వగా తినొచ్చుగా" అన్నాడు. ఆ నారయ్యేనా యిప్పుడు తనిని యిలా పరామర్శించడం!?

చక్రపాణి బుర్రంతా యిప్పుడు వచ్చే ఆలో చనల్తో పెద్ద రైల్వే జంక్షన్‌లాగావుంది. పూర్వ విష యాలు జ్ఞప్తికి రావడంతో కళ్లు స్వయంగా చూచిన విషయాన్నే మనస్సు ఒప్పుకోవడంలేదు.

కల్లుదుకాణం దగ్గర పికెటింగు చేస్తోంటే దౌర్జ న్యంగా జండా లాగి పారేసిన గమళ్ళ సోములు -

పేదరైతుకు ఉచితంగా పొలం కొలిచి పెట్టే సందుకు కారాలు మిరియాలునూరిన ప్రైవేట్ బాపినీడు-

మాల మాదిగల నంటుకొంటున్నాడని తనని వెలిబెట్టి, బావినీళ్ళకూ్కడా రానీక నానాబాధలు పెట్టిన పెత్తందారు -

యింకా యింకా చాలామంది - ఎంతటి పరి వర్తనం !!

ఎండనక వాననక ఖద్దరుమూటలు వీపున వేసుకుని గడప గడపకూ తిరిగిన శ్రమ ఫలించిందా? తన జీవితంలో చూడలేననుకుని నిరాశ జేసుకున్న స్వాతంత్ర్యం వచ్చిందా ? అనిపిస్తోంది.

"ఇప్పుడు బహిరంగసభలో మీరు మాట్లా డాలి" అన్నాడు బాపినీడు.

"ఏం మాట్లాడాలో-" తలవంచుకుని అలానే నడుస్తున్నాడు.

ప్రక్కపొలాల్లోంచి, 'బోలో స్వతంత్ర భార త్ కు జై' 'రైతు సంఘాలకు జై' 'కూలి సంఘాలకుజై' అన్న నినాదాలు — వినిపిస్తున్నాయి.

పాణి తలెత్తి చూచాడు. "ప్రజల్లో ఏమి ఉత్సాహం? "ఈ గాడ్డెకొడుకుల్ని ప్రశ్కలిరగడం తేగాని" అన్నాడు రాడీ వెంకయ్య —

"కాంగ్రెస్‌ని వెక్కిరించడం" — అన్నాడు బాపినీడు.

"ఆళ్ళ యెర్రగుడ్డపాటి చెయ్యదు కామాలు మన జెండా"

పాణి కిదంతా అయోమయంగావుంది. ఇంతకు ముందే అతను తనలోని అనుమానాల నన్నింటినీ దిగ ద్రొక్కి విజయోత్సాహి అయ్యాడు. ఇంతలో తిరిగి॥ఇది.

"గమళ్ళ నాగులు మనుమడు కామేంద్ నాగేశ్వర్రావైపోయి వూరికే పెత్తందారామె. వెట్టి వెంకడి కొడుకుని 'అరే' అంటానికే వీల్లేదామె. ఊళ్లో అన్ని మంచాలమీద ఆళ్లే —" అన్నాడు పెత్తందారు.

"అంకిని 'అంకమ్మా' అంటే ఇంకోసారి పిల వయ్యా అందిట. దాని తప్పేముంది?" అన్నాడు పరివేటు; తానేదో సమయోక్తి గొప్పగా వాడేశానని—

ఈ మాటల్తో పోటునీరు యథాస్థానానికి పోతున్నట్టయింది, పాణి ఉత్సాహమంతా.

"ఓరి దేవుడా! యీ ముండా కొడుకులు పారిపోతున్న కుల పిశాచాన్ని బలవంతాన కాళ్ళుగట్టి

లాక్కొస్తున్నారులాగుందే''! అనుకున్నాడు.

రైలుకట్టదిగి ఊళ్లోకొచ్చేస్తున్నారు. ఊరి బైటకే కనబడ్తోంది ఎర్రజెండా.

''అదుగో ఆ ఎగిరే ఆవిడనికాస్తా త్రిప్పి రష్యాకు తోల్తేనేగాని పీడవొదల్దు'' అన్నాడు మునసబు మౌన ముద్రకు స్వస్తివాచకం చెబుతూ —

అంతా ''హిహ్హిహ్హిహ్హి'' అన్నారు.

''ఔను జాతీయజండావుండగా యిది అనవసర మేమో!'' అనుకున్నాడు పాణి.

''ఐనా ఎర్రిగుడ్డనుజూచి గొడ్డు బెదిరినట్టు బెదురుతారేం వీళ్లు — ''

ఊళ్లో - రోడ్డుకుడిచేతిప్రక్కగా, ఓయింటి ముందు ఎర్రజండా - చాలామంది పిల్లలు వరసల్లో నిల బడి వున్నారు. యిరవయ్యేళ్ళమ్మాయి :

''దేశమును ప్రేమించుమన్నా -

మంచియన్నది పెంచుమన్నా''

అని పాట చెబ్తూంటే పిల్లలంతా పాడుతు న్నారు. శ్రావ్యంగావుంది పాట. ''గురజాడ మహాపురు షుని కీర్తనకు చక్కటి స్వరూపమిచ్చారు. అడుగున పడి వున్న బంగారు ముక్కల్ని త్రవ్వితీస్తున్నారు యువకులు.''

"లంజలకి పనేముంది? యిడిశేశిన రకం" అన్నాడు రౌడీ వెంకయ్య.

పదిహేనేళ్ళక్రితం పికెటింగు పూర్తయిపోయి, శిబిరానికి వస్తూన్న మహిళా వలంటీర్లనుచూచి, లాంక్ షైర్ గుడ్డల్లో వెలిగిపోతోన్న బుర్రమీసాల రాయుడన్న మాటలివే - అచ్చంగా యివే మాటలు!

తిరిగి యీనాడు పొందూరు ఖద్దర్లో మునిగి వున్న దేశభక్తుడు కాంగ్రెస్ జండా భుజాన పెట్టుకుని మరీ అంటున్నాడు - అచ్చంగా అవే మాటలు! వేషం మాత్రం భేధం -

అప్రయత్నంగా "ఛీఛీ" అన్నాడు పాణి.

రౌడీ వెంకయ్యని చాటుగా ఒక్క గిల్లు గిల్లాడు పైవేటు; నాలిక కొరుక్కుంటూ -

పాణికి ఒళ్ళంతా తేళ్లు పాకినట్టయింది. ఒక్క సారి ఆ సమూహంలో నుంచి పారిపోదామా అనుకు న్నాడు. వాళ్ళ మొహాలు చూడ్డానికే అసహ్యం వేస్తూంది. తోడేళ్ళ గుంపులో వచ్చిపడ్డ మేకపిల్లలాగ వుంది తనకి.

బహిరంగసభ - మొదటి కర్మకాండంతా ముగిసింది. చక్రపాణి మాట్లాడ్డానికి లేచి నిలబడ్డాడు. జనమంతా తనని అనుమానిస్తున్నట్టు తోచింది. ఏదో

పెద్ద తప్పుచేసినవాడిలాగా; "క్షమించండి! వందనాలు - ఊఁ - ఈ సన్మానం - నాకు కాదు - కాంగ్రెసు సంస్థకు" అన్నాడు.

"బోలో స్వతంత్ర భారత్ కుజై" అన్నారు అంతా. పాణి అలానే నిలబడి వున్నాడు.

బాపినీడు లేచి "షాహుకారు నారయ్యగారి విరాళం ఈ అయిదువందల రూపాయిలు. యిది నిర్మాణ కార్యక్రమానికి" అన్నాడు.

జనంలోనుంచి "దొంగమార్కెట్ నశించాలి!" అన్న కేకలు బయలుదేరాయి.

చక్రిపాణి ప్లాట్‌ఫారం దిగి పోబోతున్నాడు. "చూడండి! చూడండి! కమ్యూనిస్టులు సభనెల్లా గల్లంతు చేస్తున్నారో" అన్నాడు మున్సబు.

"దొంగమార్కెట్ చేసేవాడు కాంగ్రెసా? పాణిగారు చెప్పాలి" అంటూ జనంలోనించి కేకవచ్చింది.

"కాదు ముమ్మాటికీకాదు" అంటూ ఒక్కసారి దూసుకుపోయి, గుంపు కెడంగావున్న కూతుర్నీ, ముసలి తల్లినీ కలుసుకున్నాడు పాణి.

"ఎప్పుడు మీటింగు పెట్టినా యింతే" అన్నది కూతురు. తలనిలువుగా ఊపుతూ ముందుకి సాగాడు. రౌడీ వెంకయ్య రంకెలు చాలా దూరందాకా వినిపిస్తూనే వున్నాయి.

ఆరాత్రి భోజనమయ్యేలోపల - నారయ్య రూపాయికి మూడుతవ్వల బియ్యం అమ్మడమూ, కరాళ్ళంతా పట్టించడమూ, యిదంతా అర్థమయింది.

"నాన్నా! బ్రిటిషువాళ్లు కంట్రోలు పెట్టారు కాబట్టి దానికి విరుద్ధంగా దొంగమార్కెట్ చెయ్యడం కాంగ్రెసు సిద్ధాంతమటగా!"

నవ్వి ఊరుకున్నాడు పాణి.

"ఏదెట్లాఉన్నా, ఊళ్ళోవాళ్ళంతా నాగులు మనమడి పట్టే. కాకపోతే బయటపడి కొంపలార్తయ్యేమోననిగాని" - అన్నది తల్లి.

అతని బుర్రలో పెద్ద తుపాను లేచింది. అలానే పడుకున్నాడు. తెల్లవారగట్ట ఏదో కలతనిద్ర. అందులో- జనం బారులుతీరి కూర్చున్నారు. ముందరి విస్తళ్ళనిండా అన్నం - ఒక పెద్ద భయంకర స్వరూపం- దాని వెనక ఇంకా చిన్నవి పది పదిహేను.

పెద్దపెద్దగా అంగలు వేసుకుంటూ ఆ అన్నం లాక్కొంటున్నాయి. ఒకడూ, అరా, ముద్ద నోట్లో పెట్టుకుంటే, పీకలు నొక్కి కక్కించి మరీ లాక్కుంటున్నై. లాక్కున్న అన్నం పెద్దరాసులుగా పడుతోంది. అప్పటి కప్పుడే కొన్ని రూపాయలు చేసి సంచుల కెత్తుతున్నై.

పెద్దభవనం - దానిమీద కాంగ్రెసుజండా ముందు పాణి నుంచుని వున్నాడు.

తిరిగి ఆ భయంకర స్వరూపాలే. అచ్చగా అవే గడ్డాలు పెట్టుకొని పీనుగుల్ని తొక్కుకుంటూ భవనంలోకి వస్తున్నాయి. పాణి అడ్డగించాడు. వాళ్ళ వెనకాడ్తే ఉన్నాడు. యింకో పెద్ద గడ్డాలు మీసాలు. ఆయన్ని పాణి యెరుగును. ఒకప్పుడెవ్వడో తనకు నాయకుడుగూడా అయినట్టుగుర్తు.

"వాళ్ళను పోనీ. యిప్పుడవసరం వాళ్ళతోనే!" అన్నాడు. తాను తప్పుకున్నాడు.

అవన్నీ భవనంలోకి వెళ్ళిపోతున్నాయ్. ఒకటి చీలి తనదగ్గరికి వచ్చింది. చేతులు చాచింది. తాను పారిపోబోయాడు. పట్టుకుని రెండుచేతుల్తో పైకెత్తింది. తాను గిజగిజ తన్నుకుంటున్నాడు. వదలకుండా అలానే యెత్తుకుపోతోంది.

భవనంలోవున్న తన అనుచరులందర్నీ అలానే తెస్తున్నాయి తక్కినవి. వాళ్ళూ తన్నుకుంటున్నారు.

ఒక పెద్ద యేటిగట్టు – తాను గట్టిగా కేకలు పెట్టి ఏడుస్తున్నాడు. ఊహూ – ఎత్తి గభీలున ఏట్లో పారేసింది.

తుళ్ళిపడిలేచాడు. ఏమీలేదు. తనయిల్లే! తన మంచమే! విపరీతమైన దడ.

''దేశం ఏంకావాలి??'' అనుకుంటున్నాడు; ఆ దడలోనే.

—

# సూక్ష్మంలో మోక్షం-నిత్యానందానికి

మీరంతా - ఎబ్బే ! మీరేమిటి ? మేమేమిటి? మీరు + మేము=మనమందరం, ప్రతిఒక్కరం నిరంతరం

"ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే"

అనురాగపుటంచులూ, ఆనందపులోతులూ చూడాలని వేచుకొని కాచుకొని వున్నాం. కాదంటారా?

'కాదు' అనేవాళ్లుకూడా వున్నారుగాని, వాళ్లు యీ తరంవాళ్లుకాదు. వెనుకటి తరంవాళ్లు.

"—మీరు మనసారగా ఏడ్వగానీరు నన్ను — నన్ను విడిచి చూడండి. వెక్కి వెక్కి ఏడుస్తాను. విసుగూ విరామమూ లేకుండా ఘోరంగా ఏడ్చేస్తాను. గొంతెత్తి ఏడుస్తాను. హోరుమని ఏడుస్తాను. నన్ను వదలండి..."

అంటూ ఏడ్చే స్వతంత్రం కోసం తెగ గింజుకుని, చివరకు గుడ్లల్లో నీళ్లు గుడ్లల్లోనే కుక్కుకునేందుకూడా తడిలేక, నోట్లో గుడ్డలు కుక్కేసుకున్నారు.

యీ కాలపువాళ్లు ఏడ్చేందుకు నోరు రాకనో, కార్చేందుకు నీరులేకనో, పళ్ల పటపటలూ, పిడికిళ్ల

ఝుళిపింపులూ, నరాల బిగింపులూ సాగించారు.

మొత్తంమీద వీళ్లంతా ఈ ఏడుపుగొట్టు ప్రపంచానికి 'సూక్ష్మంలో మోక్షం' చూపించే ఉపాయం తోచక అపాయంలోపడి ఒకసారి విలపిస్తే, మరోసారి పలవించారు.

అబ్బ! యీ భూప్రపంచమ్మీద ఎటు చూచినా ఒకటే బాధలూ ఒకటే దుఃఖాలూ గదా!

ఒకడికి పనిలేకై తేం–మరోడికి భూమి లేకై తేం–యింకోడికి అవకాశం లేకై తేం? మొత్తంగా అందరికీ అనేకంలేక అఘోరిస్తూనే వున్నారు. యిలా అంటే–

"పెద్ద పెద్ద సంపన్నుల మాటేమిటీ?" అంటారు.

ఎంత చెట్టుకు అంతేగాలి.

అష్టైశ్వర్యాలూ వుండికూడా – 'అఖిల ప్రపంచంమీద ఆధిపత్యం రాకపోయెనే!' అని అమెరికా సామ్రాజ్యవాదం ఏడ్చే ఏడ్పుకు అంతుందా?

ఎబ్బే! అంతా ఏడ్పుగొట్టు ప్రపంచం అయిపోయిందండీ!

సాహిద్ ఆఫ్ బాల్ఖ్ అంటాడూ—

"దుఃఖమేగనుక పొగలు చిమ్మినట్లయితే

యీపాటికే యీ ప్రపంచమంతా ఆ పొగల్లో ఉక్కిరి బిక్కిరి అయిపోయి వుండేది'' అని-

నాకూ అదే భయం. దుఃఖానికి యింతవరకూ ఆ సత్తా లేదనుకోండి. అయితే యిక ముందుకూడా ఆశక్తి కలగదని ఎక్కడ వుంది?

నిజంగానే అలా జరిగి - పరిపాలించబడవలసిన మనమంతా ఆపొగలో ఉక్కిరిబిక్కిరై అయిపోతే-పాపం! మన పెద్ద నాయకులు యింకెవర్ని పరిపాలిస్తారూ!

నాకు అదే దిగులు. అందుకనే యీ దుఃఖాన్ని బాధల్నీ అధిగమించడానికి అదీ సూక్ష్మంలో మోక్షంగా వుండే మార్గంచూపి పుణ్యం కట్టుకుందామను కుంటు న్నాను.

దాన్ని ఆంధ్ర, అఖిలభారత, అఖిలఆసియా, అంతర్జాతీయ అలా అలా హనుమంతుడి వాలంలా, ఆచార్య రంగాగారి అంతర్జాతీయ వివిధ సంఘాల్లా, విశ్వ వ్యాపితంచేసి విశ్వమానవ ప్రయోజకత్వం సాధించాలను కుంటున్నాను.

ఇంతకు ఆ సూత్రం ఏమంటే- ?

''నిరంతరం ఆనందాన్ని అనుభవించాలంటే బాధలోను దుఃఖంలోను కూడా అవలంబించవలసిన ముఖ్యాంశాలు యివీ -

అ. ప్రస్తుత స్థితిలో సంతృప్తి పొందడం;

ఆ. అంతకన్నా విషమపరిస్థితులు రానందుకు ఆనందించడం.'' అన్నాడు ఛెకోవ్.

మన భారత ప్రధాని నెహ్రూజీనే చూడండి. కరువుతో సర్వనాశనమౌతోన్న రాయలసీమ వెళ్లాడు పర్యటనకు -ఆ శ్మశానవాటికలో, ఆ శవాలగుట్టలమధ్య, ఉప్పెనలా పొంగుతున్న దుఃఖసముద్రపు లోతుల్లో - ప్రకృతి సౌందర్యాన్ని తిలకించి, ఆనందంలో తన్మయుడై అరగన్నులు మోడ్చి పత్రికల్లో ప్రకృతి సౌందర్యాన్ని పిండిపోశాడు. పండితుడు, మహాత్ముడు, అహింసామూర్తి గదూ.

మా అమ్మమ్మా అంతే. మా తాతయ్య చచ్చిపోయినందుకు ఏడవదు. ఆ కట్టెల్లోనే తనను కాలవెయ్యనందుకు ఆనందిస్తుంది.

మన నెహ్రూపండితుడూ అంతే. రాయలసీమ ప్రజలకు గంజికూడా కరువైనందుకు బాధపడడు. అది తానూ నిత్యమూ తాగే పాయసంలావుందని ఆనందిస్తాడు.

మా అమ్మమ్మా, మన నెహ్రూ యిద్దరే యిద్దరూ యీ యావద్భారతంలోనూ యీ పవిత్ర సూత్రాన్ని అన్వయించుకుని ఆచరణలోపెట్టగల ధీరులు-.

మహాకవి శ్రీ. శ్రీ. అంతటివాడు.

"ముక్కుపచ్చలారని నవ్యాంధ్రరాష్ట్ర శిశువు
మూలుగుతూ మూలనున్న ముసలాడికి వధువు"

అని బాధపడతాడేగాని - చచ్చిన శవానికి కట్టబెట్టనందుకు సంతోషించలేకపోయె. సామాన్యులం మనమాటకేమొచ్చె. అలా అనుకొని వూరుకుని ఉరివేసుకుంటామా?

— మన కాంగ్రెస్ ప్రభుత్వమూ, అందులో వున్న మంత్రులూ, — వాళ్లు మాత్రం పాపం! ఏం చేస్తారూ? వాళ్ళకి వాళ్లు చేసుకోడమే సరిపోతుండె. ప్రజలకు 'ఏంచెయ్యడానికీ 'వాళ్ళకు రోజులు చాలాయి గాదు' మరి —

అందుకనే క్షణ క్షణం చెబుతున్నారు. "ఇది ప్రజాస్వామికయుగం. ప్రభుత్వం ప్రజలకు చేసేది ఏమీ వుండదు. ప్రజలే చేసుకోవాలి"-అని.

నిజం. ప్రజలే చెయ్యిచేసుకోవాలి. ఏదో అప్పుడుగాని తేలదు. కనుకనే మనం నెహ్రూ లేక అమ్మమ్మగార్లను ఆరాధిస్తూ, వాళ్ల అడుగు జాడల్లో వెళ్లిపోదాం,

ఛెకోవ్-తన సూత్రాన్ని జీవితానికి అన్వయిస్తూ చెప్పాడూ- "కాలులో ముల్లు గుచ్చుకొంటే కంట్లో గుచ్చుకోనందుకు సంతోషించు." అని -

అలాగే మనము మన జీవితాలకు అన్వయించుకుంటే నిరంతరఆనందానికినిచ్చెనలువేసుకుంటూ వెళిపోతాం.

యివిగో-ఉదాహరణకు-

నిత్యం-మీ ప్రక్కయింటి రేడియోలో గాడిదలు కూస్తూ గొడవచేస్తున్నాయనుకోండి. అవి అంతటితోనే ఆగినందుకూ; మనమీదికే దూకనందుకూ; దూకి వెనకకాళ్లతో విన్యాసాలు సాగించనందుకూ సంతోషించవచ్చుగదా!

మీ బతుకులు భారంగా వున్నాయని బాధపడుతున్నారా? ఎందుకూ? ఆ భారపు బతుకులైనా అలాగే వున్నందుకూ; మననించి దూరంకానందుకూ ఆనందించండి.

మీ మీద పన్నులు మోయలేనంతగా పడితే- అవి తన్నులు కానందుకూ; అదీ జరిగితే - అవి గుండెల్లో దూసిన సన్నీలు కానందుకూ సంతోషపడండి.

కరువూ కాటకాలు వచ్చి మీ మీదపడితే- ఆ పడ్డది చావుకానందుకు వెయ్యి విధాల సంతోషించండి.

విసుగెత్తిన జీవితాన్ని సరదాతో నింపుదామని సినీమాకు పోతే - అక్కడ ఏడుపుకూ - సంగీతా

నికీ సరిహద్దు తెలియక మీరు విపరీత విపత్కర పరిస్థితుల్లో పడ్డా చింతించకండి. అది ఏడుపూ, సంగీతమూ రెండూ కావనీ; పాట రాక ఏడుపూ, ఏడ్వలేక పాటా మాత్రమే అనీ; ఏడ్చేవాళ్ళచేతమాత్రమే పాడిస్తున్నారనీ, చచ్చినవాళ్ళచేత సైతం పాటలు పాడించేంత సాహసానికి యింకా తెలుగు సినిమారంగం దిగలేదనీ ఆనందించుదాం.

ఫ్యాక్టరీలు మూసేసి, భూముల్లోనించి తగిలేసి మిమ్మల్ని నిరుద్యోగులుగా బజార్లోకితోసేస్తే-అది బంగాళాఖాతం, అరేబియా, హిందూ మహాసముద్రాలలో ఏ ఒక్కదాంట్లోనూ తోసెయ్యనందుకూ, అదీ జరిగితే మూడు సముద్రాల్లోకీ ఒకేసారి తోసెయ్యనందుకూ ఆనందించటానికి అవకాశంవుంది.

మీభార్యాబిడ్డలూ, వగైరావగైరా తిండికిలేక చస్తే-అది మీరే కానందుకూ; అదికూడా జరిగితే మీరు తిండికిలేక చచ్చారనే న్యూనత ప్రపంచంలో ప్రచారం కానందుకూ సంతోషించండి.

మీరు చచ్చాక ఏం జరిగిందో మీకు తెలియని మాట నిజమేఅయినా-మీరు 'చచ్చింది తిండిలేకనే' అనే విషయాన్ని ప్రపంచానికి తెలియకుండా ప్రభుత్వం పకడ్బందీ చేస్తుంది. ఇది ఖచ్చితం. యీ హామీతో మీరు నిశ్చింతగా నిత్యా నందంతో మరణించవచ్చు.

ముక్తైషి

ధరలు పెరిగినందుకు దుఃఖపడకండి. ఆ పెర గడం ఊరులు కానంతవరకూ సంతోషపడవచ్చు.

మిమ్మల్ని చింతబరికెలతో బాదితే - అది ముళ్ళకంప కానందుకూ; జైల్లోపెడితే-అది మిలటరీకాంపు కానందుకూ; తుపాకితో కాలిస్తే - అది ఆటంబాంబూ హైడ్రోజన్‌బాంబూ కానందుకూ సంతోషించండి.

యిలా ఎవరి జీవితాలకువారు అన్వయించు కుని నిత్యానందాన్ని పొందడం మినహా మరి దారి లేదు.

ఎప్పటిమాట ఏమోగానీ - మన యీ ప్రభు త్వాలు వున్నంతవరకూ యీ నా సూత్రం చిరస్థాయి; శిలా శాసనం.

---

# పిచ్చి - పెళ్ళి.

"హు హు హు అమ్మా! చలిగావుందే నీ చీర చెంగేనా కప్పవే!"

"చిరిగి జీరండాలయింది బాబూ! అదేమి చలి ఆపుతుందబ్బా!"

"అమ్మా! నాన్నేగా చీరలూ దుప్పట్లూ నేసేదీ? మరి మనకే ఎందుకు లేవూ?"

"అవన్నీ మనం కూలికి నేస్తాంబాబూ! కొన డానికి డబ్బులు కావద్దూ"

"నాన్న బట్టలునేస్తే డబ్బొస్తుందిగా? మరి నెయ్యకూడదూ?"

"కొనేవాళ్లు లేక గుడ్డలు బేళ్లకు బేళ్లు మిగిలి పోయ్యాయట. యింకా నేసి ఏంచేసుకుంటారూ?"

"అమ్మా! గుడ్డలు అందరికీ ఎక్కీ దక్కీగా వుండి కొనటం మానేశారా? మరి మనకీ, వాళ్లకీ, యింకావాళ్లకీ చాలా మందికి గుడ్డల్లేవుగా?"

"గుడ్డలు ఎక్కువై కాదు కొనలేపోడం-డబ్బు ల్లేక బాబూ!"

"పని చెయ్యకపోతే ఎవ్వరికీ డబ్బులు రావుగా ?"

"ఔను"

"డబ్బులు రాకపోతే ఎవ్వరమూ కొనలేంగా ?"

"ఔను"

"ఎవ్వరూ కొనకపోతే ?"

"అలాగే వుండిపోతాయి."

"అలాగే వుండిపోతే ఎవ్వరికీ పనిదొరకదుగా ?"

"ఔను"

"పని దొరక్కపోతే డబ్బులు రావు. డబ్బులు లేకపోతే అవి అమ్మకం కావు. అవి అమ్మకం అయ్యేదాకా ఎవ్వరికీ పనులులేవు. పనులులేకపోతే...?"

"పిచ్చి కుదిరితేగాని..."

"హు-హు-హు-అమ్మా చలిగావుందే !-"

---

# క్రొత్త జాడ్యం

ఈ మధ్యనే ఓ క్రొత్తరకం జాడ్యం ప్రపంచంలో ప్రవేశించినట్లూ, బర బరా ప్రాకిపోతున్నట్లూ పసికట్టబడింది. అంతర్జాతీయంగానూ, జాతీయంగానూ, స్థానికంగానూ సైతం యీ వ్యాధి నాగుజెముడు తెగులు కంటే కూడా మహావేగంగా వ్యాపించుతోందట!

సామ్రాజ్యవాదుల, వారి వంశీయుల, గోత్రీకుల రక్తనాళాలు యీ వ్యాధి ప్రవేశానికీ, అభివృద్ధికీ అస్కారమిస్తున్నట్టు ఆధారాలు కూడా అనంతంగానే దొరికాయట!

ఈ వ్యాధి ఎప్పుడు, ఎక్కడ, ఎలా ప్రారంభమయిందీ సవివరంగా పేర్కొనడం అంత సులభంకాకపోయినా లభ్యం మాత్రం అవును.

అసలీ జాడ్యంయొక్క జన్మస్థానం అమెరికా అనీ, అచిరకాలంలోనే అన్ని దేశాలకూ చర చరా అంటుకొంటూ — ఆఖరుకు సాత్విక, ఆధ్యాత్మిక, అహింసలకు పురిటిగడ్డ అయినటువంటి పుణ్య భారతభూమిని కూడా పులుముకుని అలముకొంటున్నదనీ అనడానికి ఆవకాశాలు అనేకం.

ప్రప్రథమంగా యీ వ్యాధిని గురించిన భోగట్టా ప్రపంచానికి పరిచయం కావడంలో బహుగా పనికివచ్చిన పవిత్రమూర్తి మిస్టర్ ఫారెస్టాల్. ఆయన పేరుతోనే దీనికి 'ఫారెస్టాల్ జాడ్యం' అన్న పేరు స్థిరపడి పోయింది.

మిస్టర్ ఫారెస్టాల్ అంటే అమెరికా ప్రభుత్వ రక్షణశాఖా కార్యదర్శి. సోవియట్‌రష్యాకు వ్యతిరేకంగా యుద్ధాన్ని కొనసాగించటానికి బ్రహ్మాండమైన వ్యూహాన్ని తయారుచేసిన ప్రముఖుడు, పెద్ద ఎత్తున మారణాయుధాల ఉత్పత్తిని తన ఆధిపత్యానే సాగించినవ్యక్తి. ప్రపంచమంతటా, మారుమూల దేశాలలో సైతం సోవియట్‌పై దాడికి కీలకస్థావరాలు సంపాదించడానికి నడుంకట్టినవాడు. అలాంటి ప్రముఖవ్యక్తి — పాపం!

“మిస్టర్ ఫారెస్టాల్‌కు మతిపోయింది. గతకొద్ది వారాలనుండీ దాని చిహ్నాలు కనబడుతున్నాయి...... ఎర్రసైన్యం- అని ఏదో సంధించినట్టు గోల మొదలు పెట్టాడు. ఎంతో అతికష్టంమీద అతన్ని పట్టుకొని ఇంట్లోకి తెచ్చారు...”

అమెరికన్ రేడియోలో
1949 ఏప్రిల్ 10 న.
డ్రూపియర్సన్ ప్రసంగంనుంచి

అసలు విషయం ఏమంటే - మిస్టర్ ఫారెస్టాల్‌కు ఏదో ఓ శుభముహూర్తాన ఆకస్మికంగా ఒక పిడుగులాంటి వార్త బుర్రిలో ప్రివేశించింది. 'అమెరికా మీద రష్యన్లు బ్రిహ్మాండమైన దాడి ప్రారంభించార'ని అతని తలలో జిగేల్‌మని మెరసినట్టయింది. దీనికి కారణం విచారించగా బజార్లో ఫైర్ సైరన్లు మ్రోగిగడమేనని తెలియవచ్చింది. ఆ తక్షణమే ప్రక్కమీదినుంచి ఎగిరి పడ్డాడు. పట్టుకోవడం సైతం కష్టమయింది. యింతలో సైరన్ రెండోసారి మ్రోగింది. యికనేం? ఫారేస్టాల్ బాజార్న పడ్డాడు. ఎర్రసైన్యం ఎర్రిసైన్యం అని గోలకు లంకించుకున్నాడు. ఎంతో అతికష్టంమీద అతన్ని పట్టుకుని యింట్లోకి తెచ్చారు...

అయితేనేం? ఆ తర్వాత పధ్నాలుగు అంతస్థుల హాస్పిటల్‌మీదినించి అమాంతం పరిగెత్తుబోయి అక్కడినుంచే క్రింద పడ్డాడు.

'పాపం శపించుగాత!'

ప్రభువునందు నిద్రించేందుకు పరలోకం వెళిపోయాడు.

పోతూపోతూ నాగజెముడు తెగులులాంటి యీ వ్యాధినిమాత్రిం ప్రిపంచంమీదికి వదిలి తన వంశ వినాశనానికి పునాదులువేసి పోయాడు.

ఇతి అంతర్జాతీయం.

యిక- బోల్షివిక్ భూతాల పేరుతో గాభరా పడి గంతులువేసి, గల్లంతౌతున్న యిలాంటి కేసులు జాతీయంగా కూడా అనేకం పరిశోధించబడ్డాయి. అవన్నీ కాక మచ్చు కొకటి మాత్రమే -

ఆ మధ్యనే ఒక మంత్రిగారు చికిత్స నిమిత్తం ఊటీకి వెళ్లారు. ఆ డాక్టరు 'ఇది పారెస్టాల్ జాడ్యం' అనీ, ఆ భూతాల విషయం పూర్తిగా మరచిపోయి ఆ యా నందనవనాల సహజ సౌందర్యంపై ఆలోచనల్ని కేంద్రీకరించమని సలహా చెప్పాడు.

మరునాటి వుదయమే మంత్రిగారు వాహ్యాళి వెడలారు. కాని కొద్ది క్షణాలలోనే మంత్రిశేఖరుని నోటినుంచి నురుగుదొబ్బలు బయలువెడలసాగాయి. వంటినుంచి చెమటలు కురుస్తున్నాయి. ఎదురుగా తోట మాలి వంగి వంగి వస్తున్నాడు. 'ఇదేమి ఖర్మా!' అని.

'ఆఁ - ఆఁ - హంతకుడు - హంతకుడు' పెడ బొబ్బలుపెట్టారు మంత్రిసత్తములు.

'పులీస్ - పోలీస్ - ' సర్వాయుధ సపరివార సమేతంగా హుటా హుటీవచ్చి వాలారు. మరి ప్రజా మంత్రిగదా? వాలీ వాలడమే తోటచుట్టు ముట్టారు. చెట్టూ, పుట్టా, పొద, ఒకటా? సర్వం కళ్ళతో దున్నే శారు. పట్టు పట్టుమని 'ప్రముఖహంతకుడు' తోటమాలిని పట్టేశారు. మంత్రిగారిని మంచంమీదికి మోశారు.

హంతకుడిమీద అర్జంటు చార్జి బనాయిస్తున్నారు. కాగితాలు కాగితాలు వ్రాసేస్తున్నారు.

కళ్లు కాస్త కాస్త తెరుస్తున్నారు మంత్రిగారు.

" ఆఁ– ఆఁ– ఆఁ– " వణికిపోతున్నారు మంత్రిగారు.

వ్రాస్తున్న పెద్దమనిషి వామహస్తం వ్రాతగాడు. వంచిన తల ఎత్తకుండా ఎడమచేత్తో గిలుక్కుపోతున్నాడు.

చూచాడు. చూచాడు మంత్రిగారు. ఎవరో వామపక్షాలకు చెందిన వాళ్లు చుట్టు ముట్టినట్టేవుంది. చేజాడు ధైర్యం మంత్రిగారు. వామ పక్షవలయాన్నించి బయట పడాలని చూచారు. మూసుకున్నారు కళ్లు. దూసుకున్నారు, ఒక్కదూకులో గొందివాకిట్నపడి –

'వామపక్షం–వామపక్షం' – అని అరుచుకొంటూ–

'ఎక్కడ ? ఏరి ?' వెతికాడు. ఎడమచేతివ్రాతగాడు తనను మినహాయించి మొత్తాన్నీ. సిబ్బంది సిబ్బంది మొత్తం తెల్ల మొగాలు వేసుకు చస్తున్నారు.

"ఏదీ ? ఏరి ? వామపక్షం. ఎక్కడ ?"

ప్రమాదం ఏమిటో తోచనేలేదు వాళ్లకి. ప్రముఖ బోల్షివిక్ హంతకుడు తోటమాలి తమతోనే

వున్నాడా యే-సంకెళ్లుకూడా అలాగేవుండే-. ఆలోచిస్తు
న్నారు.

అలాగని ఆలోచిస్తూ వూరుకొంటారా ?
ఆలోచించడానికా ? వాళ్లకి ప్రభుత్వం అంతలేసి జీతాలీ
యడం. ఆలోచన మానేసి ఆజ్ఞలు ఆచరించడానికి ఆచా
రప్రకారం అంతా అక్షౌహిణిలోంచి బయల్దేరి అన్ని
వైపులా పొదలూ పుట్రలూ గాలిస్తూ కంచెలన్నీ తెగ
దిరుగుతున్నారు. ఏం జరిగిందో, ఏం జరుగుతోందో, ఏం
జరగనుందో వాళ్లకేమీ తెలీయదు.

యింతలో ఓ వైపునుంచి రొప్పుతూ రోజు
తోన్న మహాధ్వని వినవచ్చింది. ఆ ధ్వనినిబట్టి పోయి
చూస్తే మంత్రిగారు యువకోత్సాహంతో, దీర్ఘ శ్రమా
నంతరం పొందిన అలసటతో, దుడ్డుకర్రమీద గడ్డం
మోపి, శరీర భారాన్నంతా దానిమీద వదిలేసి చమ
టలు కక్కుతూండడం గమనించబడింది. ఆ చుట్టూవున్న
ఎర్రగులాబి పొదలు, ఎర్రగన్నేరు చెట్లు మందార
పందిళ్లు అన్నీ సమూలంగా ఛేదించబడి నేల కరుచుకొని
వున్నాయి. అంతమేరా ఆకాశంలో గులాబీ, మందారా
పూరేకులు గాలిలో తూనీగల్లా ఎగురుతున్నాయి.

మంత్రిగారిని చూస్తే అంత సిబ్బందికీ హడ
లెత్తింది.

మంత్రిగారు దుడ్డుకర్రను దూరంగా విసిరి

పారేశారు. హుటా హుటీ భవనంలోకి వెళ్ళిపోయారు. టెలిఫోన్ నిర్విరామంగా గంటలకొద్దీ మ్రోగింది. పత్రికా విలేఖరులు గుంపులు గుంపులుగా వచ్చారూ, పోయారు.

ఘర్నాటి పత్రికలలో గుమ్మడికాయలంత పతాక శీర్షికలలో – 'ఎర్రదయ్యాలు తనని చంపడానికి పన్ని నకుట్రల్ని ఎంత ధైర్యోపేతంగా, ఎలా ఏకాకిగా, విజయ వంతంగా, భగ్నం చేశారో–' అదంతా సవివరంగా పేజీ లకు పేజీలు వార్తలు దేశాన్ని కప్పివేశాయి. కొన్ని పత్రికలు ప్రత్యేక సచిత్ర సంచికలు సైతం ప్రకటించాయి.

ఆ తర్వాత వారం రోజుల్లో గొప్ప మేజర్ జనరల్ నాయకత్వాన ఎర్రదయ్యాల వేటకు ప్లానులు సిద్ధమయ్యాయి. అన్ని జాతుల, ఎర్రపూలు, కాయ గూరలు నాశనం కావించడానికి జైత్రయాత్రకు ఓ ముహూర్తాన ప్రారంభోత్సవం జరిగింది.

ఆ తర్వాత మరో వారానికి 'ఎరుపు' అనే పదాన్ని నిషేధిస్తూ అత్యవసర ఆర్డినెన్సు జారీచేయ బడింది.

ఇతి జాతీయం.

*　　　*　　　*

ఈ ఘోర ప్రమాదాలతో కూడిన జాడ్యమే, ఆంధ్రా వనిలో కూడా, వాడవాడలా, వారి భూస్వామ్య సోదరులను

లంకించుకొని తీవ్రవ్యాధిగా వేధిస్తున్నట్టు అనేక రిపోర్టు లున్నాయి. ఉదాహరణకు :- ఓ రిపోర్టు

... గ్రామం-'క'. కాలం-1949 జూన్.

విషయం — ఈ గ్రామపరిసరమంతా ఎర్ర ప్రమాదం జాస్తిగా వున్నట్టు ఎప్పుడోకని పెట్టబడింది. అందుకైన అత్యావసర చర్యలు అర్జంటు అర్జంటుగా తీసు కోబడి 'ఎర్ర' అనబడే సమస్తమూ; ఆ ఆలోచనా సహి తంగా దుంపనాశనం కావించబడి విజయస్తంభమునాటిన గ్రామాలలో యీ 'క' ప్రధాన గ్రామం.

సదరు విజయోత్సవాలసందర్భంగానే — ఈ దుంపనాశనానికి అనాదిపునాది నాయకుడైన శ్రీతల్లివేరు గార్ని ఈ 'క' గ్రామంలోని పిల్లవేరులు సన్మానించేం దుకై ఆహ్వానించారు. పంచభక్ష్యపరమాన్నాలతో విందులూ విడ్డూరాలూ జరిపారు. ఆ రాత్రి గడిచి తెల్ల వారినాక చూడగా శ్రీతల్లివేరులుంగారు ఎవరితోనూ చెప్పనైనా చెప్పకుండా స్వర్గానికివెళ్ళిపోయినట్టు తేలింది, అసలువిషయాన్ని అన్నిఆధారాలతో పరిశీలించినమీదటి సారాంశం ప్రకారం —

...ఆరాత్రి శ్రీతల్లివేరు అయ్యవారు-చుట్టూ సపరివార పహరాలతో సురక్షితమనుకున్న భవనంలో విశ్రమించినారనిన్నీ; యికబయటపిల్లవేరు సేవాదళాలు - నాయకులు పెట్టినభయంతో గుండెలుగుప్పిళ్లల్లోపట్టుకుని,

గుడ్లు రెప్పల్లోపెట్టుకుని మూకధైర్యంతో వెన్నుతట్టుకుంటూ; ఎర్రదయ్యాలు ఎటునుంచివచ్చిపడతాయోనని పీచుపీచుభయంతో నిద్రపోతూన్న కమాండరు ఆధిపత్యాన కాచుకొంటూనేవున్నారనిన్నీ; అయితే-

అలాంటి సమయంలో రెండుగంటలరాత్రప్పుడు గాఢనిద్రలో కాపలాను పర్యవేక్షిస్తూన్న కమాండరు గుండెలమీద గుభీమని ఎర్రదయ్యం దూకినట్టయిందనిన్నీ; సదరు కమాండరు గోండ్రిపెడుతూ ప్రక్కనేవున్న ఆయుధాన్ని పఢేలునఅందుకొని అతిత్వరితంగా ఆజ్ఞలు జారీచేస్తూ ఆ తందరలో ఆయుధం ఎటువున్నదీకూడా చూచుకునేవ్యవధిచాలక ఆపాళ్ళే పేల్చుకుని కాల్చుకున్నారనిన్నీ; ఆమోతకు కళ్లింతలూ తుళ్ళింతలూపడ్డ దళసభ్యులంతా ఎవడికివాడే ఎదటివాణ్ణి ఎర్రదయ్యంగా ఎంచుకుని గోలగోలగా తాము క్రొత్తగానేర్చుకున్న విద్యాప్రదర్శనం సాగించారనిన్నీ; పోతే-

యీస్థితిలో లోపలి అయ్యవారు బయటితొక్కిడికి కంగారుపడిలేచి వాకిళ్లుకానరాక పారిపోయేదారిలేక ఆశోపహతులై మంచాన్నికావిలించుకుని బావురుమన్నారనీ; ఏడుపూఎక్కిళ్లూ పెనవేసుకుని వచ్చిపడి ఉక్కిరిబిక్కిరై 'హాఁమ్మ'ని-ఆవులించారనిన్నీ; అదేఆఖరి ఆవలింతసన్నీ; అభిజ్ఞవర్గాలవారి అంచనాలననుసరించి ధృవపరచబడింది. శవపంచాయతీ రిపోర్టులో అవసరార్థమై

ఎర్రిదయ్యాలు చంపినట్టు వేరుగా వ్రాయవలసివచ్చినా-అసలు నిజమైన రిపోర్టుమాత్రం పైన వుదహరించినదేనని గమనించేది.

ఇతి స్థానికం.

◆ ◆ ◆ ◆

ఈజాడ్యమే మరో జిల్లాలోని 'అ' అనే గ్రామం లో కూడా ఒకర్ని సోకి మరో రూపంలో పీడించింది.

'అ' గ్రామంలో కేశవులు అనే భూస్వామి వున్నాడట. ఒకానొకనాటిరాత్రి, ఆయన చాలా ప్రొద్దు పోయేవరకూ ఎర్రిదయ్యాలను హతమార్చడానికి అభేద్యమైన ప్లానులు చర్చించిచర్చించి కొంపకు చేరుకొన్నాడట. తలుపులన్నీ బిగించి, ఇనపగడ్లువేసి, ఒకసారిమళ్లీ అన్నీసరిచూచి పందిరిమంచంమీదికిచేరి పరుపులు పైకిలాక్కొని మరీపరున్నాడట. ఎర్రిదయ్యాలు ఒకవేళవచ్చి పడ్డా మొదటిదెబ్బలు పరుపుకే తగుల్తాయని-

మరోగుంటలో ఎంతోదూరంనించి వచ్చిన దగ్గరబంధువులు వర్షాన్ని వెంటబెట్టుకువచ్చారు. వచ్చి తలుపులుతట్టడం కేకలుపెట్టడం సాగించారు. వాళ్లురావడంవిటే-వీరి పుత్రిరత్నానికి పెళ్లిసంబంధంకోసరం వచ్చారుట. ఈయనమాత్రం ఎర్రిదయ్యాలు తనపెళ్లికే వచ్చాయని హడిలిపోయాడు. అంతిఎత్తు పందిరిమంచంమీది

నుంచీ దూకి భయంతో భార్యను చాటుచేసుకోబోయాడు. కాని మరొకటిచేసుకున్నాడు. గుడ్డలన్నీ తడిసిముద్దైపో యాయి, చెడుగబులుకొట్టాయి. చుట్టూపట్టూ, అయిన వాళ్లూ, వచ్చి 'యిదండీసంగతీ' అన్నా నమ్మడే!

హాస్పిటల్‌లోచేర్చారు. ఐనా బెడ్ మీద దుప్పట్లు గంట కొకటీరెండూ మార్చాల్సివస్తున్నాయి. పక్కనే వుండేవాళ్ళముక్కులు బద్దలుకొట్టుకుపోతు న్నాయి.

ఇతి సర్వేసర్వత్రాం

కలంతాజా:- మనఢిల్లీ, మద్రాస్, కర్నూలు హైదరాబాద్ వగైరా రాజభవనాల్లోసైతం యిది అప్పుడప్పుడూసోకడం - శివాలూచిందులూ పెట్టించడం సర్వసాధారణంగా జరిగేవిషయం.

గమనిక :- యిలా యీ వ్యాధిప్రవేశించడం ఒకేవిధంగా జరుగుతున్నా, పరిణామంలో రకరకాలుగా పట్టిపీడించుకుతింటోంది. యింతవరకూ యీ జాడ్యానికి మందుకనిపెట్టినవాళ్లు కన్పించడంలేదు. — 'నభూతో నభవిష్యతి : కూడానట. ఎలాగంటే—

యీ వ్యాధినివారణకై పరిశోధనలూ ప్రయో గాలూ సాగించిన ప్రముఖవేత్తలంతా ఏకకంఠంతో ఓ

నివేదికను ప్రకటించారు. అందులో — 'సామ్రాజ్య వాదులూ, వారివారి వంశీకులూ, వారి ఆచారాలూ, యీప్రపంచంలోవున్నంతకాలమూ యీ జాడ్యాన్ని నివారించే తరుణోపాయంలేదనీ; అది అంతమైతేనే యీవ్యాధి అంతమూానసీ, యీ నివేదికకు తిరుగులేదనీ చెప్పేశారు.

---

# ప్రాణంవెల

మూడురోజులాయె. ముసిరిముసిరి కురుస్తోంది వాన. గడపలోకాలు బయటపెట్టేందుకులేదు. ఒకటే ముసురు. చుట్టూప్రపంచమంతా తడిసిముద్దయికూచుంది. చెట్లన్నీ యీ వానకి తలారాస్నానాలుచేసి పచ్చగానిల బడ్డాయి.

ఈవురుమంటూ ఒకటేచలిగాలి. ఎముకల్ని కూడా కొరుక్కుతింటోంది. 'ఆకాశమంతా' తూట్లు పడ్డట్టు ఒకటేవకధార. ఏదేవుడన్నా కాస్తచెయ్యిఅడ్డం వేస్తేబాగుండిపోను. కానిఏదీ? వానేమీకట్టుబడేట్టులేదు. ఆకాశాన్నంతా కాటుకమబ్బులు యింకాదట్టంగాఅలికి వేస్తున్నాయి. దూరానకొండలమీదచూస్తే అగుపిస్తాయి. జీమూతాలూ ఎలావడివడిగా కొంపమునిగినట్టు రాచుకు పోతున్నావో!

మాంచి ముమ్మరంగా ఊడ్పులు సాగాల్సిన రోజులివి. ఇన్నాళ్ళదాకా పనుల్లేక ఇగిరి 'బెకబెకా' మన్న కూలీనాలీ జనమంతాఎదురుచూస్తూకుర్చున్నారు. ఎండిన చెర్లోకప్పల్లాగా - ఇంతలో యీవాన వచ్చిపడింది. ముంచుకుపోయినట్టు. మూడురోజులపాటు కూలీవాళ్ళ

నోళ్ళల్లో ముద్దపడగొట్టింది.

ఇంతతో మాత్రంఅయిందా? ఒకవేళ రేపో మాపో వానఆగినా - నిండి, చెరువుల్లాగా తటాయించుకు కూర్చున్న చేలల్లో మురుగు బయటికి పోవద్దూ? సుఃయ్యాన మురుగుతియ్యటానికేఁ కాలువులా? పాడా? ఆ చేలోనుంచి ఆచేలోకి అలాఅలా సాగిపోయి ఏట్లో పడ్డానికి ఎంతకావాలో? ఎన్ని కజ్జాలో? ఎన్నితలలు తగలాలో?

ఇంతకూ పరవళ్లుతొక్కే నాగావళితల్లి పాటున పడాలిగదా! మురుగునంతా తరగదోడుకు పోయేందుకు. ఇదంతాఅయి మళ్లీ పనులుసాగేందుకు పదిరోజులైనాపట్టకపోనా? ఈపదిరోజులూ పక్షుల్లా నిరాధారంగావున్న పాటకజనమంతా బ్రతికేదెట్లా?

-ఇదే ఆలోచన సింహాద్రికి.

గుర్రపుపాకాలాంటి చిన్నపాకలో ముణగదీసుకుని కూర్చున్నాడు. వానజల్లూ, చలిగాలీ, రాకండా- అడ్డంవేసిన రెల్లుతడికె సందుల్లోంచి బయటిప్రపంచాన్ని చూస్తున్నాడు. గోచీమినహా కాసింత గుడ్డపీలికకూడా లేదు. ఒంటిమీద-వణికిపోతున్నాడు.

సింహాద్రికి ఏటిపాడుగూన్నా పడవగడుపుతూండటమేపని. యేటికి అద్దరి యిద్దరిఆసామీలు పంటకళ్లాల

రోజుల్లో తలాకాసిన్ని గింజలూ కొంగులో పోస్తారు. అదంతా సింహాద్రికి రెణ్నెల్లగ్రాసం. అందుకుగాను సింహాద్రి వారినీ వారిబంధువుల్నీ దమ్మిడీపుచ్చుకోకుండా సంవత్సరాంతమూ ఏరు దాటిస్తూవుండాలె.

ఆ రెండు నెల్ల గ్రాసానికే ఆ ఏడంతానావను అంటిపెట్టుకొని వుండటం లాభసాటి బేరమేమీకాదు. అలాఅని యింకేంచేస్తాడు? ఆ గూడెంగూడెం మొత్తం లోనూ ఆ రెండు నెల్ల గ్రాసమైనా గ్యారంటీగా దొరికేది సింహాద్రికొక్కడికే. అందుకే అలా ఏప్రొద్దూ ఆనావని కనిపెట్టుకొని పడివుండడం.

దానికితోడు మొగంఎరగని వాళ్ళదగ్గర ఖరా ఖండీగా అణాబేడా వసూలు చేసుకొంటాడు.

ఏటినిండు తగ్గి కాలినడవలు పడ్డాయంటే చేపాజెల్లాపట్టి అమ్ముతుంటాడు. ఎటొచ్చీ ఒక వేసంగుల్లో మినహా ఏకాలమూ కూలికిపోయే పనేలేదు. సింహాద్రికి, ఆకాలంలోనైనా కూలిపనులేముంటాయి? చేయించేందుకైనా రైతులదగ్గర తడివుంటేగదూ! ఏకాస్త చెక్కలోనో రాగులుజల్లితే, మైళ్లకుమైళ్లు నీళ్లుమోసు కొచ్చి పొయ్యలేక చావాామె. ఆచావుపడలేక ఏకాస్త లోనో యింతతిండికి సరిపడా చల్లుకుంటే, వాటికినీళ్ళు ఆలుమగలే చల్లుకుంటారు. యింకా కూలీ నాలీతో ఏంపని?

ముసలితల్లీ, తానూ, పెళ్లాం, చంటిపిల్లడూ యీనాలుగు పొట్టలకే యిన్నితంటాలూనూ.

మూడురోజులాయె, ముసురుబట్టి. ఏడురోజులాయె-ఎగువను వానలుకురిసిన కారణంగా త్రుళ్లింతలు పడ్తూ పగబట్టిన తాచులా, పరవళ్లుత్రొక్కుతోంది... నాగావళి. పడవకదిలించే పారంలేదు. వచ్చేపొయ్యే జనం లేరు. అణాడబ్బులు చేతిలో పడిందిలేదు. పొయ్యిలో పొగ లేచిందిలేదు.

ఆ కాసింతపాకా నిశ్శబ్దంతో పేరుకుపోయింది. అంత కుటుంబమూ-నరాలను పెటపెటా నమిలి చప్పరిస్తోన్న ఆకలిబాధని కిక్కురుమనకుండా భరిస్తోంది.

ముసల్ది ఓమూలగా పొయ్యివారనే చింకిగోనె మీదపడి దహించుకుపోతోంది. ఆకలితో ప్రేవులు మెలికలు తిరుగుతున్నాయి. ముక్కులు బుసగొడ్తున్నాయి. కాళ్ళు కొంగర్లు పోతున్నాయి.

సిమ్మాద్రి పెళ్ళాం గైరికి ఏడోనెల-చంటివాడు పాలకు గింజుకొంటున్నాడు. పాలురాక, కసికొద్దీ కొరుకుతున్నాడు. మూడురోజులాయె. ఆహారంఅంటూ లోపటికిపోయి. మూన్నాళ్ళక్రితం ఊదబియ్యం కాచుకు తాగినందుకు విరేచనాలుపట్టుకుని ఝాడించివదిలాయి. గుండెల్లో బాధ సుడులు తిరుగుతోంది. కడుపులోని

మంటలవేడికి, గొంతులో తడి యిగుర్చుకుపోతోంది. పైగా యీ చంటిపిల్లడిబాధ.

"ఒరే! చిమ్మన్నా! యిత్తల తల్లి చత్తా-ఉః" మూలిగింది ముసిల్ది.

సిమ్మాద్రి వెనక్కేనాతిరిగి చూచాడుకాదు. అసలు విన్పించనేలేదు. అతగానిప్రాణం-చెవిగూబల్లోచేరి 'ఝుః' మంటున్నది. నవనాడులూ క్రుంగిపోతున్నాయి. అతడికీ ఎవరికంటేనూ తక్కువ ఆకలిలేదు. కాని తాను ఎవర్ని అడిగేట్టు, ఎవరిమీద విసుక్కొనేట్టు; ఎవర్ని తిట్టిపోసేట్టు-అలాగే బయటికి చూస్తున్నాడు.

బయట భూమ్మీదికి మెల్లగా చీకటితెర జారుతోంది.

లోపల పాకలోకి సన్నగా చావుపొర పారుకాడ్తోంది.

ఎవరో పళ్లునూరుతున్నట్టుంది. చావబోయే ముసిలిదో; చంపబోయే మృత్యువో? ఒకవేళ చావే అమాంతంగా విరుచుకుపడ్డా, ఒక్కళ్లుగూడా కెవ్వనకేకపెట్టే స్థితిలోలేరు.

—సింహాద్రి యింతప్పట్నుంచీ ఆ నాగావళీ తల్లి ఒడిలోనే పెరిగాడు. తపతపా కాళ్లుకొట్టుకుంటూ, రెపరెపా బారలుచాస్తూ, ఆ నాగావళీ జలాల్లోనే

యీదాడు. తెల్లనివెన్నెట్లో, చిక్కనిచీకట్లో–ఆ నాగావళీ యిసుకశయ్యలమీదే, గోచీయేనా లేకుండా గురకనిద్దర్లు తీశాడు. పెద్దయ్యాకకూడా ఆతల్లి బాహువుల్లోనే మునుగుతూ తేల్తూ 'గజయీతగాడ'నిపించుకున్నాడు. ఆతల్లి చలువలోనేగైరికి (ప్రేమపాత్రు)డయ్యాడు. ఆపేరుతోనే పడవనడిపేందుకు కుదిరి నాలుగురాళ్లు తెచ్చుకొంటున్నాడు. ఆతల్లితోడుకోసమే వూరునీ వుపాన్ని వదిలి దూరంగా నాగావళి ఒడ్డునే చిన్నపాక వేసుకున్నాడు. ఏఒడ్డునుండి, ఏ వేళలో పిలిచినా 'ఓ' అంటున్నాడు. కాని—

తానుపిలిస్తే పలికేందుకుమాత్రం లేరు. అంతా ఒక్కసారిగా చచ్చివూరుకొన్నా, రెండోకంటివాడికి తెలీదు.

'ఒకళ్లచావు ఒకళ్లకి తెలీకుండా అంతా వరుసాగ్గా చావలేదుగదా!'– అలాచస్తే వాళ్లని ఈడ్చిపారేసేందుగ్గానీ; మరొకళ్లని పిలిచేందుగ్గానీ తనకి ఓపికలేదు.

'ఏమిటీ ఆలోచనలు–?'

వాళ్లంతా నిజంగానేచస్తే–? అందుకు బాధ్యత ఎవరిది?

ముసల్ది– మొన్న మొన్న, చూపుపోయేదాకా కూడా, నడుంపట్టుతప్పినా, అలాగే తిరిగితిరిగి ఏకందమూ

లందుంపలో అమ్ముతూనేవుండేది. ఏచాటెడు గింజలో తెచ్చి సంసారానికింత ఎదురు వేస్తుండేది. యీదశలో అన్నీ వుడిగి, కాలూ చెయ్యీ కదపలేనిస్థితిలో తిండిలేక చస్తే- ఆతిండి పెట్టలేనిలోపం తనదికాదూ? ఆపాపం తనది కాదూ?

గైరిమట్టుకు గైరి. ఏడునెలల్నిండినా యీడ్చు కుంటూనైనాపోయి, ఊడ్పులూడ్చి పావలోపరకో వ్రతి నిత్యమూ చేతలో పెట్టకపోయిందా?

పాలకైనా నోచుకోని ఆగుంటడి మాటేమిటి? ఎల్లానో ఒకల్లా పెంచి పెద్దవాణ్ణిచేసుకొంటేనేగదూ! ముసలితనంలో కాలూ చెయ్యీ ఆడని అవస్థలో యింత ధారకం పోసేందుకు-

వీళ్ళంతా తిండిలేక చచ్చారంటే ఎవరిది బాధ్యత?

"ఆకలితో కాదు చచ్చింది. రోగాలతో" అని ఓస్టేటుమెంటు ప్రపంచమ్మీదికి విసిరేసి, బాధ్యత వది లించుకొంటున్నారు పెద్దలు. ఆమార్గం తెలియదు సింహా ద్రికి. అలాంటి కిటుకులు తెలిసేందుకు - పాపం! ప్రభు త్వంలో పదవులేమీ వెలిగించాడుకాడు సింహాద్రి. ప్రజల కోసమే పడిచస్తానని ఓట్లుపుచ్చుకుని ఒడ్డెక్కినవాడూ కాడూ. మంత్రిగా మారేందుకు మారు మనసుపొందిన వాడూ కాడు. కనీసం పంపమన్నట్టల్లా రిపోర్టు పంపే

కరణమూ కాడు; కలెక్టరూ కాడు. రెక్కలుండీ ఎగరలేని పక్షి సింహాద్రి.

సింహాద్రికి బలంగా రెండురెక్కలున్నాయి. సింహాద్రి కొక్కడికేయేం? దేశంలో కోటానుకోట్ల కున్నాయి రెక్కలు. ఆరెక్కలన్నీ – డొక్కల్ని పూడ్చు కొనేందుకు ఏమైనాచేస్తాయి. కాని చేసేందు కేదీ? పని–

మన ప్రధానులూ అప్రధానులూ అంతా చేరి పాటికి పదిమాట్లు సోమరితనాన్ని వదలండి. బాగా పని చేయండి'' అని నిత్యమూ రేడియోలల్లో ఉభయ సన్యాసాలు చేస్తున్నారు.

అలాగని సింహాద్రికి తెలియదు. తెలిసివుంటే ఆ రేడియోముందేనా మోకరిల్లి ''పని చూపెట్టండి బాబూ!'' అని ప్రాధేయపడును.

''ఆలికి...ఎదుర్గా...కూసుండి... అందాలు ...సూత్తుంటే... ఆకలి తీరేనీ?'' పెగిల్చి పెగిల్చి నసిగింది. ముసిల్ది–

గైరికి పెళ్లై కాలు గడపలో పెట్టిననాటినుంచీ నేటిదాకా ఒకటే సాధింపు ముసిల్దానికి– ఆ అలవాటే యిందులోనూ–

'తన మనమరాల్ని కట్టుకోకుండా నే నడ్డుపడినానేటి? యిదేటిరా బగమంతుడా! చావుతరవాతకీ లావు దుక్కం' లోపటే గొణుక్కున్నది గైరి.

'ఏటబ్బా! చావన్నా రాదేమే!' కసుక్కు-మన్నాడు సింహాద్రి.

'అదొస్తే యింకేటికావాలి?' బయటికే అన్నది గైరి.

సిమ్మాద్రి తిరిగిచూచాడు. గైరి కళ్లల్లోకి చూచాడు.

ఎంతమంది వొద్దని మొత్తుకున్నా వినక తననే కట్టుకున్నందుకు బాగానే అయింది. ఎంతెంత వేసి నాయుళ్లూ గైరికేసి కళ్ళప్పలించేవోళ్లు. సైఁ అంటే గైరిని అందలాల్లో మెట్టి పూజించివుందురే! తనని కట్టుకోని గైరి ఏం బావుకుంటున్నాది?'

"చిమ్మన్నా...యీడ ... తల్లిముండా ... సత్తా వుంటేని..."

"ఏటీ గుంటడు? ...అబ్బ ..." నీరసంగా గైరి విసుక్కు-న్నది.

సిమ్మాద్రికి వుండబట్టలేదు. చివుక్కు-న లేచాడు. దణ్ణెంమీాద్ది చింకిపంచె బుజానికి లాక్కు-న్నాడు. విసురుగా రెల్లుతడిక లాగాడు. వొంగిన పాళానేపోయి బయటపడ్డాడు.

"యాడకి?" అడిగింది గైరి.

"ఏట్లోకి." చెప్పాడు. పోతూనే చీకట్లో

మునిగిపోయాడు.

తడిక కంతలోనించి చలిగాలి బోయ్యిన పోసుకొంటోంది.

గైరి లేవబోయింది. కాని లేచిందికాదు. కళ్లు తిరిగాయి.

సందెట్లో పిల్లగాడు నేలమీదికి దొర్లి గీః మన్నాడు. గైరి కళ్ళుమూసుకున్నది.

♦ ♦ ♦ ♦

చీకట్లో అక్కడ మునిగిన సిమ్మాద్రి – సంజ దీపపువెల్తుర్లో కోమటిగుర్నాథం దుకాణం ముందు తేలాడు.

అంతకుముందే గుర్నాథం సంజదీపం వెలిగించి, దీపంముందు ఓ చీమతలకాయంత బెల్లపుముక్క పెట్టాడు. దానికి ఎదురుగ్గా కూచుండి ధ్యానంలో పడ్డాడు. ఆకాస్త సేపట్లోనూ ఎవరేనా దుకాణం దొంగిలిపోకుండా ఆత్మను దుకాణంమీద కేంద్రీకరించాడు. ఐనా ఎలాబోయి ఎలా వచ్చునో అని మధ్య మధ్య కళ్లు తెరుస్తూ మూస్తూ వున్నాడు. ధ్యానం పూర్తయి, రెండు లెంపలూ గట్టిగా వాయించుకుని, గభీమని యీ మిధ్యా ప్రపంచంలోకి దూకేశాడు.

కుచ్చిరిచాటున క్రీనీడలో మొద్దాలెనుల్చున్న

సింహాద్రి హఠాత్తుగా కప్పించేసరికి గుర్నాథం గుండె గతుక్కుమన్నది.

"ఎవరదీ ?"

"నేనండి చిమ్మణ్ణి."

"ఓరి దొంగనంజకొడకా ! పలకవేటిరా?"

"మూన్నాళ్లాయి. యింత సల్లందితాగి—"

"అయితే నన్నేటి దానంచేసుకోమంటావు?"

"ఉత్తినే యేటండి. దినామూ అమ్మని నావ గడిపేవాణ్ణి"

"ఏటి మారాజు....ఓలమ్మొ!"

"ఏటిపొడుగూనా మీసేవజేసేవోణ్ని. మల్లా సెయ్యి మెసిల్నాక యిచ్చుగుంటాను. ఓ కుంచీడునూకలు సెంగున పోత్తిరాంబె_"

"కుంచీడుగాదు. సిట్టెడు కూడా దొరికేదిలా_ నేనేటి పోగోసుకున్నానా?"

"బాబ్బాబ్బాబు—"

"అసలు సంజెవేళ నాచేత అబద్ధమాడించాల నేటా?- ఎన్నడూ అడగనోడివి అడిగేవే గనుక ఓ పొగాకుతునక నోట్టోయేసుకో - పెడ్తాను."

"మూన్నాళ్లుగా సల్లంది తాగించేలేదు.. యిం

బెల్లపాది కటికిపస్తులు. ఏరు బుసలుగొడ్తా పొంగి వడ్తాండె. నావ కదిపిందెలేదు. కాని డబ్బు సేతులో పడిందెలేదు.''

గుర్నాథానికేదో గుర్తుకొచ్చింది.

''ఒరె సిమ్మన్నా! ఏరు తీసినాదేకాదట్రా?''

''ఏటి తీయడంబాబూ! ఎగవన వోరికొంపలు తీసినాదో! కొంపలకి కొంపలు, మంచాలు మాకులు దుంగలు దూలాలు గుణ్ణమేసి కూల్చుకొస్తన్నాది.''

''ఒరి నీయెమ్మెర్రిగాల–నీబుర్రేటిజేసురా! సిత్తడి కాలం. పుల్లబుడికీ తడిసి పెద్దపెద్ద నాయుళ్లె అల్లాడుతున్నారె. యీ పొద్దంతా నాయుడోరు. పొయ్యికట్టెలకు యాపగిస్తానేవుండ్రి–ఆరినీ యీరినీ యాచిచ్చకపోతే,ఎట్టో పడి వూరికేబో యేసరుకు ఒడ్డుకుపట్టిస్తె ఎంతడబ్బానురా.''

''ఒలమ్మో! తీయడమే. నేనుగాని–తీసినాక నాయుడు బారికాళ్ళని పంపి నూక్కుపోడు?''

''నీకాడ అంతె మరి. నేనుగాదు సొమ్ము జేసేది.''

''అట్టనే సేద్దుం కానీండి.''

''ఎప్పుడ్రడ యింక? యీ రేత్తికి రేత్తిరే దిగక–''

''అయ్యోవ్. ఏరు ఎట్ట|పరవళ్లు తొక్కుతున్నాది;—''

"అదేర మాతో వచ్చినాది. ఏరు తీసినాక ఒక్క పుల్ల వుంటాదిర?"

"యీ వుమ్మ్రరంలో నావల్ల నేటీకాదుబాబు"

"ఏటి డొంకులు డొంకుతావుర. నిన్ను నేను ఎరగనూ! కాలుసేతులు గట్టి వరదలో యిద్దగిని పారేస్తే అద్దరికెల్లినవాడివిగాదుర - అది సూసేకాదు, మారాజుల్ని మన్నెమూకుల్లు సేసి గైరి నీయెంట బడ్డాది. లేక పోతే నీబుర్రికి గైరి దక్కిందే-!"

"అట్టనే - రేపు సూద్దంలెండి." సిమ్మాద్రి వెనకటి అనుభూతుల్లో పడబోతున్నాడు.

"రేపేటి నీ మొగం. వూరంత మొగబడినాక నీకు ఒక్క పుల్ల దక్కేనారి? రేత్రికి రేత్రి వొల్లొంచి తెల్లవార్లు తీసి పోగేస్తనను. మూడుకుంచాలు నూకలు. యిప్పుడే కొల్చుకో-

"........."

"ఏటిర? మొద్దాలె వలకవు."

"ఏటాశ బాబూ! తెల్లార్లు తీసిన కర్రికి మూడుకుంచాలల్ల కొలిశేని?"

"రేపు వూరంతా ఎగబడినాక నాకాడమాత్రం ఎవరు కొంటార్రి? కడాకి ఒకటేమాట. మూడుకుంచాల్నూకలూ రెండురూపాయలు యిస్తా. యిష్టముంటే

నూసుకో. లేకుంటే పల్లక పో."

"యింకోరూపాయి సేసుకోండి."

"ఓ రేయ్. అన్న దేటో అనేశినాను. అబద్ద మాడిచ్చేశ."

"నీనుమాత్రిం ఏమంత అడిగేను- ఆబకటీ-"

"సరిగ్గా తూచి అన్నాను. యింక దమ్మిడీ మిగిల్నా నష్టమేఅనుకో- ఏటి? నూకలుకొల్చేన ?"

"ఏటి శే స్తం? కొలవండి."

"యీపొద్దీ నూకలుకొల్సుకో. డబ్బు రేపు-"

"సారవనై తే యిట్టే అరిగిపోను. చిట్టిళ్లు కొలవండి."

—సింహాద్రి ఆ నూకల్లోనే కాసిన్ని కాసిన్ని పోసి ఉప్పుమిరపకాయ, అవీ, యివీ మూటగట్టుకున్నాడు. రెండు అంగల్లో కొంప చేరుకొన్నాడు.

అన్నీ అయి కాలేశడుపుల కింత గంజిపోసి సొద చల్లార్చుకునేసరికి రెండు జాములపొద్దుపోయింది.

చిటాపటా చినుకుల్లోకి సన్నగిల్లింది వాన. కురిసికురిసి తెల్లబోతున్నాయి మబ్బులు. ఆ మబ్బుల అంచుల్ని దాటుకుంటూ,. మసగమసగ్గా తెరలు తెరలుగా దిగుతోంది వెన్నెల.

తినక తినక తినడంతో కాళ్లూ చేతులూ తీసుకుపోతున్నాయి సిమ్మాద్రికి. అయినా తప్పదుమరి. కడుపుకు తిన్నవాడు ఎరగడూ? అలాగే బయటికివచ్చి ఏటి ఒడ్డునే నిలబడి ఏటికేసి చూస్తున్నాడు.

మిగతా ప్రకృతంతా నిశ్శబ్దంగావుంది. ఏరు మాత్రం 'ఝూం'మ్మని ఘోషపెడ్తోంది. ఒడ్డుల్ని పడద్రోసి, ప్రపంచాన్నే మింగి, తనగర్భంలో విలీనం చేసుకోవాలన్నంత దాహంతో క్షణ క్షణం పైకుబుకుతోంది. చాచిన అలలతో ఆ దరీ యీ దరీ ఒరుసుకొంటూ చప్పరిస్తోంది. ఉవ్వెత్తుగా లేచే అలలు ఒడ్డుల్ని ఢీ కొంటున్నాయి. విరిగి వెల్లకిలా పడుతున్నాయి. కోపంతో ఘూర్ణిల్లుతోంది నాగావళి. తనజైత్రయాత్రకు అడ్డుగా నిలబడ్డ ఒడ్డులతో తీవ్రంగా ఘర్షణ పడ్తోంది. మరింత బలంగా వచ్చి తాకుతోంది. ఆ తాకిడికి తాళలేని చోటల్లా ఆ ఒడ్డూ యీ ఒడ్డూ విరిగిపడుతూ 'గుభీ దభీ' మంటున్నాయి.

వెన్నెల వెలుగులు పడ్డ చోటల్లా-తిరుగుతోన్న సుళ్ళూ, కరుగుతోన్న అలలూ, పోతోన్న వేగం స్పష్టంగా కనిపిస్తోంది. ఏట్లో కొట్టుకొస్తోన్న ఇళ్ళకప్పులు వస్తూవస్తూనే ఎక్కడికక్కడే జారిపోతున్నాయి. ఎక్కడో దూరదూరాల్లో గోచరించే గుంజలు, దుంగలు, అన్నీ అంతలో వచ్చిపడి రెప్పపాట్లో ఎంతోదూరం వెళ్ళిపోతు

న్నాయి. గిరుసిన సుళ్లుతిరిగి అగాధాలలోపడి అదృశ్యమౌ తున్నాయి. ఎక్కడ తేలుతున్నా యో!

'ఏమివేగం-ఎంతవేగం?'

చెవుల్లో ఏటిఘోష, కళ్లముందు ప్రవాహ వేగం, చుట్టూ భయంకరమైన అర్ధరాత్రి నిశ్శబ్దం. సిమ్హాద్రిగుండె మొత్తబడింది.

అనంతకాలంగా నిత్యనూతననీ, వందలజనాన్ని తననావనీ గుండెలమీద ఉయ్యాలలూపుకొంటూ - గల గలా పాడుకొంటూపోయేతల్లి, నాగావళి-ఈరోజు వేయి బారలుచాస్తూ వేలకోరలు నూరుతూ కబళించడానికి ఉవ్విళ్లూరుతోన్నట్టుంది.

ఎన్నివరదలురాలేదు, పోలేదు. ఇంతకంటె మహా ప్రమాదాలు ఘటిల్లు మంటోన్న సమయాల్లో కూడా సింహాద్రి నిర్భయంగా దూకాడు. సునాయాసంగా బయటపడ్డాడు.

ఆతల్లి హృదయంలో ప్రతిచిన్నలోతూ సింహా ద్రికి ఆకళింపే. ఆమె అగ్రహంలో అనుగ్రహంలో ఎలా మసులుకోవాలో ఆ మెళుకువలన్నీ అతనికి కొట్టినపిండే.

ముసిల్ది కడుపు పట్టినంతా పట్టించి కదలకుండా తొంగుంది. పిల్లవాణ్ణి ముసిలిప్రక్కలో దూర్చేసి ఆచెర నుంచి బయటపడ్డది గైరి. మొగుడికి తానూ తోడుం

టుంది. అలాగైతేనే గైరికి తృప్తి-

ఏటిఒడ్డున గోచీ మాత్రంగా నల్లరాతి విగ్రహంలా నిలబడివున్నాడు సింహాద్రి.

“అబ్బ! ఏటిచలి? నరాలు జివ్వున నాగేస్తన్నాది.” అంటు సింహాద్రిని రాచుకొంటూ నిలబడ్డాది గైరి.

“నీవేలా? యీదురుగాలి. మంపు. జలుబు చేస్తాది. లోపటికిపో_”

గైరి కదల్లేదు. మారుమాట పలకలేదు. అతడి గుండ్రని బుజంమీద చెయ్యివేసి నిముకుతూ, అల్లాగే ఏట్లో - వచ్చేపోయే సరంజామా; తిరిగే కరిగే సుళ్లూ; పడేలేచే అలలూ, చూస్తూ నిల్చొంది.

సింహాద్రి అలాగే నిల్చుండి నిల్చుండి ‘సర్లే లోపటికిపో’ అంటూ గైరినుంచి వేరై ఒడ్డుమీదినించి మెల్లగా జారి నీళ్ళల్లో కాలుబెట్టాడు.

“అబ్బ! హుహుహు-హు-”

నిండాములిగితేగాని చలిదారిన చలిపోదు. గభీమని నీళ్ళల్లో బోర్లాపడి ఒక్కమునుగు మునిగాడు. ప్రవాహం ఊ నెట్టేస్తోంది. ఒడ్డుకు రెండుబారల దూరంలో నడుములోతు నీళ్ళల్లో నిలబడ్డాడు. దుంగల్ని పట్టే ఒడుపుకోసం చూస్తున్నాడు.

అరవైరెండు

పదిబారలు ఏటికి ఎదురు వెళ్లాడు, చూచాడు. ఇరవైబారలు దిగువకు పోయాడు, కాచాడు. పెద్ద మాం నోళట మీదికి దూకుతుంటే సరిసజారి ఒడ్డునందుకు న్నాడు.

ఒడ్డుమీద గైరి - సూదంటురాతి ఆకర్షణకు అటూ యిటూ తిరిగే ఉక్కుముక్కలా, సింహాద్రి పోయిన వైపుకల్లా పోతోంది.

సింహాద్రి ఒడ్డెక్కాడు. తలా మొఖం పిండు కున్నాడు. ఎగువకేసి ఏకదీక్షతో చూస్తున్నాడు.

గైరి ఏవేవో, ఉపాయాలు చెబుతోంది-బయ టికి. అపాయాలు ఆలోచిస్తోంది-లోలోపల.

"అరెరెరె" అంటూ ఎదురు పరుగెత్తి ఎగిరి దూకాడు. ఎక్కడో రెండుఫర్లాంగుల దిగువను తేలాడు. ఓ పట్టు గుప్పెడు బడితె నొకదాన్ని బుజాన వేసుకుని గులుకు పరుగుమీద వచ్చాడు. బడితె నక్కడ పడేసి మళ్ళీ ఎగువకు పరుగెత్తాడు.

ఎంతో ఎగువకు పరుగెత్తుతున్నాడు. ఏట్లో దూకుతున్నాడు. ఎంతో దిగువను ఒడ్డు ఎక్కుతున్నాడు. దొరికినప్పుడు ఏగుంజనో, ఏకర్రిముక్కనో తెస్తున్నాడు. దొరకనప్పుడు ఏదీలేదు. ఫలితంఏమైనా ఎగువాదిగువా పరుగులూ; ప్రవాహవేగానికి ప్రయాసపడ్డం; తప్పేదేమీ

లేదు. తడవతడవకూ అలుపు ఎక్కువతోంది. రొజుతు
న్నాడు. రొప్పుతున్నాడు. అలాగే పరుగెత్తుతున్నాడు.
యీదుతున్నాడు. అన్ని మెళుకువలూ అంతశక్తీ వినియో
గిస్తున్నాడు. మూడుగంటలుగా పడ్డశ్రమనీ కళ్లతో పోల్చి
చూచుకోవాలంటే—

ఒడ్డున—నాలుగైదుదాకా గుంజలూ, ఒకటో
రెండో మొద్దులూమాత్రం పడివున్నాయి.

యీకట్టెలకోసం తానుఎంత శ్రమపడ్డాడో
గుర్నాథానికేం తెలుస్తుంది? అసలు ఎందుకు తెలియాలి?
అతనికి కావలసింది – అక్షరాలా అక్కడ పడివున్నకర్రి;
ఆకర్రిని అమ్ముకుంటే రాగలలాభం; అదీ తానుయిచ్చిన
నూకలకీ యివ్వబోయేరూకలకీ యిబ్బడిముబ్బడిగా
వుండడం. యిదే! ప్రిపంచం తిరగడమే యీసూత్రం
చుట్టూ—

సింహాద్రికి ప్రాణం వుసూరుమనిపించింది
పట్టుదల హెచ్చింది. యీసారిపోయి కాలుకుదిరినచోటు
జూసుకుని నిలబడ్డాడు. వచ్చిన ప్రితిదాన్నీ పట్టుకోవా
లనే ప్రయత్నంలేదు. ఒకేచోట నిలబడ్డాడు. తనదగ్గర
కంటా వచ్చిన ఏపుల్లనేనా పట్టుకొంటే పట్టుకొంటాడు.
"గైరీ! నే, నే, నే—" అంటూ అక్కడినించే గిరవాటు
పెడ్తాడు. పడెనా, అది ఒడ్డునపడ్తుంది.. తన గంజి
క్రిందకేనా వస్తుంది. పడదూ? ఏట్లోనేనా కొట్టుకు

పోతుంది... యిలా సాగుతోంది, అనేకం ఒడ్డున పడ్తు న్నాయి. కాని...

"ఆఁ! రా-రా-"

ఓ పెద్ద మొద్దు వచ్చి పడ్తోంది. సిమ్మాద్రి మీదికే దూకుతోంది. గైరి ప్రాణం గుటగుటలాడింది.

"అల్లా - అల్లా" సుళువుగా తప్పుకున్నాడు. ఒక్క నెట్టుతో వేగపు జాలుతప్పించాడు. ఆనుకొని అలాగే వచ్చాడు. మరో రెండుమార్లు జాళ్లుమార్చాడు. ఒడ్డు పట్టించాడు.

సుళువుదిక్కు పాటున పడాలేగాని ఎంత పెద్ద మానైనా నీళ్ళమీద ఏపాటి?

"ఓలె గైరి! సూసినావా? చిమ్మన్నం టే-హేఁ!" సింహాద్రికళ్ళల్లో విజయగర్వం తొణికిసలాడింది.

"ఓలబ్బొ! నేనెరగనోటి కొత్తచిమ్మన్న-" పరాచికమాడింది గైరి.

తిరిగీ సింహాద్రి తనపనిలో పడ్డాడు. మరోటి ఒడ్డుచేరింది. యింకోటి-యింకా...

"ఏకలపఅడితీ వోసి కర్మంకాలాదో!" నాగావళీతల్లి అడితీముత్తాన్ని అందిపుచ్చుకున్నట్టున్నాది. వరుస వరుసగా వచ్చిపడుతున్నాయి. చీలిపోతున్నాయి.

సింహాద్రి చాలా జాగ్రత్తగా కాచాడు.

ఎక్కైనాప్రమాదమే. అందుకనే ప్రతిదానిమీదికీ ఎగబడటంలేదు.

రెండుదూలాలు. జంటగావస్తున్నాయ్. అందు చాపులోకే వస్తున్నాయ్. ఒక్కఊపులో జాలుతప్పించ గలిగితే -! లేకుంటేపోయి సుడిగుణ్ణంలోకిజారతాయి.

ఒక్కక్షణంలో. పై కెగిరి నీళ్లమీద తేలాడు. బలంగా నెట్టేందుకు యిబ్బడిఓపికతో చేతులుపై కెత్తాడు. ఆ మొద్దుమీదపడబోతున్నాడు.

తాచు. పడగెత్తిన తాచు. ప్రాణభయంతో దూలాన్ని చుట్టుతూ బుసలుకొడ్తోంది.

''సచ్చిపోనానె - గైరీ'' పిచ్చికేకపెట్టి విరుచుకు పడ్డాడు.

''ఆఁ...'' గైరి గావుకేకపెట్టింది.

సింహాద్రి మరోబారెడులోపోయి సుడిగుండంలోపడ్తాడు. అందుకే వెర్రిబలంతో ఒడ్డువేపుకుకోయాలని తలపైకెత్తాడు.

దూలం తాకిన తాకున కణత ఎగిరిపోయింది. అతనుపెట్టిన కేక నాగావళీ గర్భంలో దాగిపోయింది.

గైరి ఒడ్డునపరుగెత్తుతూ కళ్లతో ఏరంతా గాలిస్తోంది. కనబడ్డప్రతిదాన్నీ సిమ్మాద్రేనని పరికిస్తోంది. ఏదో తెలియని భయంతో తోచనిబాధతో అటూయిటూ పరుగులెట్టబోతుంది. కాళ్లాడక కూలబడుతోంది. తెల్ల

వార్లూ అలా ఏడ్చిఏడ్చి తెల్లవారేసరికి ఎక్కడో దూరాతి దూరాల్లో పిచ్చిగా తనప్రాణాన్ని దేవులాడుకొంటోంది.

తెల్లవారి ఝామున్ప్రొద్దెక్కేనాళ - ఎవరికో తొలిసారిగా కన్పించాడు సింహాద్రి. మైలు దిగువను, ఏటుమలుపులో రెల్లుదుబ్బుల్లోకితోసేసి తనదారినేతాను వెళ్ళిపోయింది నాగావళి.

గైరి కిది తెలియదు. నిరాశచేసుకొని కాళ్లీడ్చు కుంటూ గుండెలుబాదుకొంటూ కొంపకుచేరుతోంది.

పాకముందు జనం గుంపులు గుంపులై చూస్తు న్నారు. ముసిల్ది సింహాద్రిమీద అలాగే పడిపోయింది. ఏడుపు గొంతులో బిగుసుకుపోయి, చేతులతో ఊతడు వుతోంది కొడుకుదేహాన్ని.

పాకలో చింకిగోనెమీద మురికిదారంలా గిల గిలా తన్నుకుంటున్నాడు చంటాడు.

గైరి వచ్చీరావడమే శోకవృక్షంలా విరుచుకు పడింది. తల నేలకేసి బాదుకొంటోంది.

సింహాద్రికేమీ ? అతగాణ్ణి కాల్చడానికి అతడు పోగెట్టుకున్న కట్టెలేవున్నాయి. పిండంవెయ్యడానికి రాత్రి తెచ్చుకున్న నూకల్లో యింకా శేరుదాకా మిగిలే వున్నాయి.

'ఎంతమంచి జల్మ, ఎన్ని అవస్థలుపడితే ఏటిగనక ...చచ్చేనాటికూడా మరోళ్లకి కట్టెలేనా ఋణపడ

కుండా పోగొట్టుకుమరీ ప్రాణంవదిలాడు' అనుకొంటున్నారు జనం.

అవతల వల్లకాట్లో చితిపేరుస్తోంటే-యివతల గుర్నాథం కడుపు చితిలాగానే మండుకుపోతున్నది.

'శాఋణాం – నాఋణాం – నామూడు శేర్లనూకలూ' అనుకుంటూ లోలోపలే పిసుక్కు-పిసుక్కు చస్తున్నాడు. గుర్నాథం.

ఆసమయంలో బయటికి అంటే-ఆజనమంతా ఎక్కడ వుస్తారో తోచకా – అనకపోతే మూడుశేర్ల నూకలూ వసూలయ్యేదారి అందకా –

---

# ఆంధ్రాభివృద్ధికి

ప్రత్యేక రాష్ట్రానికోసం బహుకాలంగా ప్రయత్నించాం. ఎలాగైతేనేం సాధించాం. ఐనా సంతృప్తిలేదే!

"ఉన్నదే తిను, లేనట్టి దానికొరకు

పోరుబెట్టకు ముద్దుకుమార! నీవూ" — అని చిన్ననాడేనేర్చుకొన్న చిరస్మరణీయమైన నీతికిశాస్త్రా చెల్లు చీటీకొట్టేశాం. 'పెద్దతనమువచ్చి బుద్ధి పెడతలపట్టెన్' అని తెలివిలేని తెలుగువాళ్లకి యిదో తెగులుపట్టుకొందీ. ప్రతివాడినోటా

"ఫలితానికిరాలేదు" అనే అసంతృప్తేనాయె.

అసలు మనకు రాష్ట్రందేనికో? మొదట తేల్చేసుకొంటే — వాటినిబట్టే అదిఫలితానికి వచ్చిందీరానిదీ యిట్టేతేలిపోతుంది —

అసలు మనకు :రాష్ట్రందేనికి?

యీ ప్రశ్నకు సమాధానం చెప్పగల ఇంగిత జ్ఞానులు యింతవరకూ కనిపించడంలేదు.

"అరవల దోపిడిని తొలగించడానికి" అంటారు ఒకరు.

కమ్మని సాంబారు, కాఫీ కడుపులోపోసి డబ్బులుపుచ్చుకోడం దోపిడేనా?

"ఉద్యోగాలన్నీ ఆంధ్రులకు దక్కకుండా యితరులకుపోతున్నాయి" అంటారు మరొకరు.

అసలు ఉద్యోగమంటేనే సేవావృత్తి అన్న విషయాన్ని మరచిపోయినవాళ్ళకు పట్టుకొన్నజాడ్యం యిది. సామ్రాజ్యాలకు సామ్రాజ్యాలు ఏలుబడికావించిన ఆంధ్రజాతికిపట్టిన అవలక్షణం యిది. ఉద్యోగాలపేరుతో ఆఫీసుల్లో ప్రొద్దస్తమానం పడివుండడం ఎలాంటి నికృష్టమో తెలియని తెలివితక్కువతనం. నిరుద్యోగులుగా బజార్ల వెంట ఊరేగుతుంటే ఆంధ్రపట్నాలు ప్రజలతో కిక్కిరిసి పచ్చపచ్చగా ఎలా వెలిగివిలసిల్లుతాయో ఊహించలేని అంధుల అంధత్వం యిది.

అసలీ వుద్యోగాల వూసే బానిసలక్షణం. ఆంధ్రజాతికి తీరని అవమానం.

పోతే - "మన పారిశ్రామికాభివృద్ధికోసం-" అంటారు యింకొకరు.

మనకు పరిశ్రమలులేనిదెక్కడ? ఉన్నవేవో వున్నాయి. లేనివి లేనేలేవు. ఏమయితేనేం? మనకు కావలసింది సామాగ్రి. ఎక్కడనుంచివస్తే మనకేం గనుకా-?

వాటిని సింధియా, దాల్మియా, తాతా, బిర్లా, ఎవరో ఒక విసన్న మనం అడిగీ అడక్కముందే మన

అవసరాల్ని గుర్తించి అందిస్తున్నాడా? లేదా? అన్నది ప్రధానం. కాని ఆంధ్రుడే అయితే మనకి ఒరిగి ఒడిలో పడేదేమిటి? హాయిగా కాలుమీద కాలువేసుకుని నోట్లో వేలేసుకుని కూర్చోక.

అవసరమని తోస్తే 'ది ఆంధ్రా గోంగూర కంపెనీ లిమిటెడ్' కూడా ఏ 'బిర్లా' నో ఏర్పాటు చేస్తాడు. సుప్రసిద్ధమైన కాకర్ల మూడీ గోంగూర సప్లై చేస్తాడు. సలక్షణంగాతింటూ కూర్చోక - యింకా పరిశ్రమలూ ప్రాజెక్టులూ అనడం అర్థంలేని విషయం.

ఏతావాతాతరచిచూడగా తేల్తున్నదల్లా ఒక్కటే-

'ప్రముఖనాయకులకందరికీ చాలినన్ని పదవులు కావాలంటే ప్రత్యేకరాష్ట్రం ప్రధానం' అని —

ఆంధ్రజాతీయనాయకుల్లో అధికభాగం యిప్పటికీ పదవులకోసం అల్లాడిపోతూ బజార్ల వెంట తిరుగుతున్నారంటేనూ; పరాయివాళ్ళ పదవులుచూచి పళ్లు పులిసి 'నక్క - ద్రాక్షపండ్లు' నాటకాలు ఆడుతున్నారంటేనూ; విసిగివేసారి వేరువేరు పొయ్యిలు పెట్టుకున్నారంటేనూ విచారపడతగ్గవిషయం. 'ఆ కొరతతీర్చడానికే ఆంధ్రరాష్ట్రం' అంటే — అంగీకరించాల్సిన విషయం.

యిందుకే ఆంధ్రరాష్ట్రం అని తేలిపోయింది గనుక-వచ్చినరాష్ట్రంలో ఇది ఫలితానికివచ్చిందా? లేదా?

అందరికీకాకపోయినా కొందరికైనా పదవులు

దొరికినట్లు నిదర్శనాలున్నాయి. కనుక ఫలితం 'ఏమీ' కన్పించడంలేదనేదిఅసత్యం. పోగా–మనకింకా ఏపదవులూ లేక వుసూరుమంటోన్న మిగతావాళ్లూ కనబడుతూనే వున్నారు. గనుక 'ఫలితం పరిపూర్ణంకాలేదు' అనేది సత్యం.

ఐతే అది ఎలా వస్తుంది? అన్నదే యిప్పుడు మన ముందుండుకోన్న చిక్కు సమస్య.

'ఆరంభింపరు మూఢమానవులు' అన్నాడు ఓ కవి. మనం మూఢమానవులంకాము కనుకనే ఆరంభించేశాం. అయితే 'ఆంధ్రులది ఆరంభశూరత్వం' అన్న బిరుదంకూడావుంది మనకి. మనం దాన్నిపోగొట్టి చరిత్రని మరోవిధంగా వ్రాస్తేనే — 'ఆంధ్రులం అసహాయ శూరులం' అన్న ఖ్యాతివస్తుంది. ఈ 'అసహాయ' అన్నది మనకేం కొత్తగాదు. గతంలో కాంగ్రెస్ 'అసహాయ' ఉద్యమంలో అమోఘంగా పనిచేశాం. అందుకనే మన కాంగ్రెస్‌నాయకులు సర్వేసర్వత్రా అసహాయంగా ఎవరికి వారే పోతూంటారు...

కాబట్టి మనంకూడా వారిలాగే ఆ పరిపూర్ణ త్వానికి ప్లానులు పూర్తిచేయాలి.

ఈ యుగాన్ని ఎవరు ఏమన్నా, ఇదిమాత్రిం నిజానికి సంఘాలయుగం. అంచేతనే యిప్పటికే – 'విశా లాంధ్రి రైలుప్రయాణీకులసంఘం' 'సినిమా ప్రేక్షక సంఘం' యిలాంటివి అనేకం వెలుస్తూన్నాయి. వీటివల్ల

పెద్దబాధలేదు. ప్రపంచంలోని ప్రతివాడూ ఎప్పుడో ఒక ప్పుడు రైలు ఎక్కకపోడు. ఎప్పుడో ఒకప్పుడు సినిమా చూడకపోడు. అంచేత వీటినిర్మాణానికేమీ అవస్థలేదు. అయినవాళ్ళ నలుగురిమధ్యా కూచోని ఓ పేరుపెట్టేసు కుంటేచాలు. కార్యవర్గంఅంటూ తలాఒకపదవీ పంచు కుంటేచాలు. మిగతా ప్రపంచమంతా సభ్యులూ, వీరు నాయకులూ అయిపోతారు. పూనుకొని పుష్కరానికో స్టేట్ మెంటు యివ్వు. తోచినప్పుడు సాంవత్సరికంపెట్టు. పెట్టలేవూ? అదీ అక్కర్లేదు. చెయ్యలేదని అడిగే వాడుండడు. చేస్తే ఏడ్చేవాడుండడు.

కనుకనే — యిలా సూక్ష్మంలోమోక్షంగా మనప్లానును పూర్తిచెయ్యాలి.

అందుకుగాను — రాష్ట్రాభివృద్ధికై రభస పడేవారంతా యీక్రింది కార్యక్రమానికి తక్షణం పూను కోవాలి.

1. ఎ. 'పొగత్రాగువారిసంఘం' 'పొగత్రాగుడు నివారణాసంఘం' 'పత్రికాశ్రోతలసంఘం' 'పత్రికాచూప రుల సంఘం' యిలాంటి వెన్నైనా స్థాపించేందుకు నడుంకట్టాలి.

బి. ఇవి ఆంధ్రరాష్ట్ర సంఘాలూ, విశా లాంధ్ర సంఘాలూ, అఖిలభారత, ఆసియా, అంతర్జా తీయ సంఘాలదాకా నిర్మించాలి.

సి. వీటన్నిటికీ అధ్యక్షు, కార్యదర్శులూ, కోశాధిపతులేగాక కావలసినన్ని 'ఉప' లు కూడా ఏర్పాటుచెయ్యాలి.

డి. యింతేగాక — ప్రతిసంఘమూ కార్యాచరణ, ఆచారణశూన్య; లైజాన్సు, రినైజాన్సు కమిటీలు విచారణసంఘాలూ కాలపరిమితిలేకుండా వేస్తుండాలి.

ఇ. ప్రభుత్వానికూ-డా ప్రతికార్యక్రమానికీ అధికార అనధికారమిటీలనూ, ఉపసంఘాలనూ నిర్మించడమే పరమావధిగావుండాలి.

యఫ్. దినపత్రికలన్నీ వీటికి విపరీతమైన ప్రచారం యివ్వడంలో యిప్పటిపద్ధతినే కొనసాగించాలి.

2. మనం యింత విస్తృతమైనప్లానులు యిలా వేసుకున్నప్పటికీ ఒకేదానికే అనేకమంది పోటీలుపడే ప్రమాదంవుంది. కనుక అతిజాగ్రత్తగా ఐక్యతను సాధించాలి. యిప్పటివరకూ మనం సాగిస్తున్న కృషిలో — ఐక్యతకోసం రెండుపార్టీలూ ఏకమై మూడు, నాలుగుగ చీలడం, నిత్యసత్యంగా ద్యోతకమౌతోంది. కనుకయిప్పుడు మనం పోయేమార్గం ఐక్యతకు దారితీయదన్నమాట.

చచ్చి ఏ స్వర్గానవున్నాడో సర్దార్ పటేలు మహాశయుడు వెనుకటికోసారి అన్నాడు.

"మొదట మీ తలలన్నీకూడాలి" అని — ఆ కాస్తాజరగాలేగాని నిజంగామనం సాధించలేనిదేలేదు.

మరి మన తలలు ఎలా కూడుతాయి?

జుట్లూజుట్లూ ముడెట్టుకోడంకన్నా మరి దారి లేదు. అందుకూడా వీలులేకుండా బ్రిటీష్‌వాళ్ల పుణ్యమా అంటూ మన తలలన్నీ క్రాపింగులుఅయి జుట్టేలేకుండా పోయింది. కనుక —

క. ఈ రోజునుంచే జుట్లూజుట్లూ ముడిబెట్టుకోడానికి వీలుగా జుట్టుపెంచేందుకు పంచవర్ష ప్రణాళిక నొకదాన్ని ప్రకటించాలి, ప్రారంభించాలి.

చ. యీ అయిదేళ్ళలోనూ పెరిగే జుట్లకు పన్ను పడకుండా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలనుంచి గట్టి హామీకి ప్రయత్నం చేయాలి.

ట. మనం క్రాపింగులు తీసివెయ్యాలంటే కామన్వెల్తు ఆమోదంవుండటం అత్యవసరం గనుక — త్వరలో కామన్వెల్తుదేశాల సభజరిపించేందుకూ, అందులో యీ విషయాన్ని ప్రతిపాదించేందుకూగాను మన ప్రధాని నెహ్రూ దగ్గరకు ఒకరాయబారకమిటీనిపంపించాలి.

'ఆలస్యం అమృతం విషం' అన్న సూక్తిని జ్ఞాపకంవుంచుకుని అందినవాళ్లు అందినట్టు పదవులుపుచ్చుకోడమూ, అందనివాళ్లు జుట్లుపని పెట్టుకోడమూ తక్షణం సాగిస్తేనేగాని రాష్ట్రాభివృద్ధి సాధ్యంకాదు.

---

# అనాధప్రేత సంస్కారం

"ఏంరోయ్ చైత్రం!"

"ఎందుకేమిట్రా వైశాఖం?"

"ప్రపంచం కంటిలో నల్లపూసవయ్యావేమోయ్!"

"యికనుంచీ హిమాలయం కాబోతున్నామోయ్."

"ఏమిటేమిటీ? కాస్త నాకో చెప్పగూడదురా!?"

"అందుకేగదోయ్. కాఫీకూడా పోకుండా యిల్లారావడమూ."

"భేషో భేషు!"

"మనం ఓ అఖండసన్మానం ఏర్పాటుచెయ్యబోతున్నామోయ్"

"దానికి నీవు అధ్యక్షుడుగావుంటే బాగుంటుందిరా."

"నీవుకార్యదర్శిగావుంటే భేషుగ్గావుండదురా!"

"మరి మన భోషాణంగాడ్రా"

"వాడు కోశాధిపతోయ్"

"ఏరా భోషాణం?"

డైభైఆరు

"రైటో! రైటు"

" మనం యిప్పుడు ఏమిట్రా చెయ్యడం?"

"భోషాణంగాడు ఫొటోగ్రాఫీ నేర్చుకోవాలోయ్!"

"మరినేనా?"

"సన్మానపత్రంరాసేందుకు కవిత్వం నేర్చుకోవోయ్"

"ఏరా భోషాణం?!"

"నాకు యింతలో రాదురా బాబూ!"

"పదేళ్లలో రాకపోవటమేమిట్రా? అంతా విస్తారం."

"పదేళ్లదాకనట్రా? మన సన్మానసంతర్పణ."

"పదేళ్లకి మనకి ప్రత్యేక రాష్ట్రాలువస్తాయి."

"పదేళ్లకి మనవి చాలా జాతీయంఔతాయి"

"పదేళ్లకి మనకి తిండికొరత తీరుతుంది"

"పదేళ్లకి మనదేశం భూతలస్వర్గంఔతుంది"

"అన్నీ పదేళ్ళకేగదురా!"

"మరి అప్పుడేగదరా! మన అఖండసన్మానం"

"పదేళ్ళదాకా కార్యదర్శి ఏం తిని పని చేస్తాడురా"

"నిధులు వసూలుచెయ్యమటోయ్!నిధులు—"

"ఙానోయ్. మనం తక్షణం వసూళ్లుప్రారంభించాలి."

"వసూళ్ళకి కరపత్రాలు వేయించొద్దురా!"

"యింకెవడూ యీసంఘం పెట్టకుండా మనమే ముందు పత్రికల్లో ప్రకటించొద్దురా."

"పని ప్రారంభించేందుకు డబ్బుకావలిగదూ. యిటు తెండిరా నేను కార్యదర్శినీ!"

"నన్నడుగుతావేంరా ? భోషాణం వుండగానూ."

"అవునోయ్ ! వాడు కోశాధిపతిగదూ !"

"ఏరా భోషాణం. స్వల్పంగా పదిరూపాయలు ఇలా పడెయ్యరా."

"నేనేం పడెయ్యలేనురా బాబూ"

"ఆవున్న డబ్బంతా తగలేసుకుంటావా ఏంరా?"

"నాకుమాత్రిం ప్లానుల్లేవట్రా."

"అదేమిట్రోయ్"

"పదేళ్లగ్గదురా అన్నీ జరిగేది"

"అంతేనోయ్. అంతే-"

"ఇవన్నీ అయ్యేదాకా ఆగలేనిజనం చస్తుండట్రా"

"..............."

"వాళ్లకందరికీ గోరీలు కట్టించొద్దురా"

"ఛా న్రోయ్ లేకపోతే కుళ్లి గబులుగొట్టదూ!"

"ప్రభుత్వందగ్గర్నుంచి కాంట్రాక్టు తీసుకోబోతున్నానోయ్"

"ఛీ-ఛీ-వెధవపని"

"అదేమిట్రా! అనాధప్రేత సంస్కారం-కోటి యజ్ఞఫలం భవేత్' అనలేదురా పెద్దలు."

"ఏఁరా చైత్రం!"

"ఏమిట్రా—"

"ఓరే భోషాణం - అందులోనే మాయిద్దర్లో ఒకడికి గుమాస్తా. ఒకడికి సూపర్వైజరూ నన్నా యిప్పించరా!"

---

## సూది—సోది

శీనాయిబుర్ర గిరగిరా తిరుగుతోంది. అంటే భూమి తనచుట్టూ తాను తిరిగినట్టు, మెడమీద గిర్రున తిరుగుతోందనికాదు. కాశీబ్రాహ్మడి బుట్టలో రావణుడ్ని చూచిన సీతబొమ్మలా అటూయిటూ తిరుగుతోందనీ కాదు. అసలు ఆతిరగడం శీనాయిబుర్ర కానేకాదు. అత గాడి బుర్రలోని ఆలోచనలుమాత్రమే.

ఐతే శీనాయిబుర్ర యీరోజే ఏదో మంచి ముహూర్తం చూచుకొని ప్రారంభించలేదు - యీతిరగ డానికి. అది యెప్పుడూఅంతే. అలా ఏదోఒక సమస్యతో గింజుకొంటూనే వుంటుంది. ఎప్పటికప్పుడు సరికొత్త సమస్యలు ఆబుర్రలో పూరుతూనే వుంటాయి.

అసలుదాన్ని 'బుర్ర' అనడంకంటే ఓ'సమ స్యల కార్ఖానా' అనడం తగివుంటుంది.



ఈమధ్య శీనాయి నిత్యమూవచ్చే దినపత్రికలు చూస్తున్నాడు. 'చూస్తున్నాడు' అంటే చూస్తున్నాడనే కాని చదువుతున్నాడనికాదు. శీనాయి పత్రికలుచదవడు. తీరిగ్గాకూచుని విపణివీధితోసహా రాగాలుతీసి చదవడానికి

అది అతగాడి స్వంతమైతేకదూ! ఐనా ఆచూడటం మాత్రింతోనే ఆపత్రికలు మనవాడిబుర్రకి ఓముడిసరుకు నందించాయి.

'ప్రజాస్వామికమంటే ఏమిటి?' అని— పత్రికలు ప్రతిరోజూ చెక్కుతున్నాయి.

—'ప్రజాస్వామికానికి ప్రమాదం' అని—

'ఏమిటో? ఆప్రమాదం!'

'ఏమిటో లేపోనీ' అని వదిలెయ్యగూడదూ? అలావదల్లేదు శీనాయి. శీనాయి వదిలేవాడేమోగాని వాడి బుర్ర అలా వదుల్తుందా! అది సమస్యల కార్ఖానా ఆయెను.

'ప్రజాస్వామికానికి ప్రమాదం'

అదైనా ఏఒకరో అరో అంటున్నదికాదు. ఏ సామాన్యులో అంటున్నదికాదు. అమెరికా అధ్యక్షుడు ట్రూమన్, అట్లీ, పండితనెహ్రూ, లియాఖత్ఆలీఖాన్, ఆచార్య రంగా, డాక్టర్ పట్టాభి, అంతా — చివరకు మామూలు పోలీస్ ఆఫీసర్‌సైతం అదే అంటున్నాడు.

'ప్రజాస్వామికానికి ప్రమాదం' అని—

అలాంటప్పుడు ఆప్రమాదమేమిటో తెలుసుకోకుండా, ఆప్రమాదాన్ని నివారించి ప్రజాస్వామికాన్ని పరిరక్షించకుండా, కూచోడం శీనాయిబుర్రకి చాలా అన్యాయమనిపించింది.

కాని-చేసేదేముంది? కనీసం - ఆప్రమాదమే మిటో? ఎవరికో? తెలిస్తేగదూ!

అలా-ఆలోచించగా ఆలోచించగా 'ప్రజాస్వామికం ప్రమాదంలోపడింది.' అంటే - ప్రజాస్వామికం ఏముసలమ్మోఅయి ఆవిడ కాస్తా కాలుజారిపడిందేమో! అందుకు వీళ్లంతా "మ్చ్‌మ్చ్‌మ్చ్" అంటున్నారేమో! అనితట్టింది. మొదట శీనాయికి-

కాని - ప్రిజాస్వామికాన్ని పరిరక్షించేందు కంటూ జరుగుతూన్నహంగామా - అట్లాంటిక్ ఫాక్టులూ, పశ్చిమయూరప్ సమైక్యతలూ, జర్మనీ జపాన్ ఫాసిజాలకు పునరాయుధధారణలూ, డాలర్ అప్పులూ యివన్నీ ఓముసలమ్మని రక్షించేటందుకేనా.

ఈమధ్య ఉత్తరకొరియాలో ప్రజాస్వామికం ప్రమాదంలోపడడమూ, దాని పరిరక్షణకంటూ అమెరికా సమస్త మిలటరీ బలగాలతో దిగబడడమూ; అప్పటికీ ఆ ప్రమాదం తప్పక మిత్రరాజ్యసమితిలోని ఛప్పన్న దేశాలూపోయి పీకులాడడమూ; చూచాక — 'ప్రిజాస్వామికం – ముసలమ్మకాదు' అని తేల్చుకొన్నది శీనాయి బుర్రి.

"ఐతే మరి...?" మళ్ళీ ఆలోచనకు లంకించు

కున్నది. అనేక దృక్కోణాలనించి పరిశోధనకు దిగింది. శీనాయి బుర్ర...

ప్రజాస్వామికం అంటే 'పప్పూ గోంగూర' కాదుగదా!'– శీనాయికి పప్పుగోంగూర యిష్టం.

ఐతే నాన్నకు కాకరకాయ యిష్టం. అమ్మకు చేపపులుసు యిష్టం. అమ్మ యిష్టం నానకు నష్టం. మా యిద్దరి యిష్టం అమ్మకు కష్టం — కాబట్టి అందరికీ యిష్టంకాని పప్పుగోంగూర ప్రజాస్వామికం ఎలా అవుతుంది?

చర్చిల్‌కు చుట్టలంటే యిష్టం, పట్టాభిగారికి యిన్సూరెన్సు కంపెనీలంటే యిష్టం, రంగాగారికి అనేక సంఘాలు పెట్టడంయిష్టం, నెహ్రూగారికి ప్రకృతిసౌందర్యం మాట్లాడ్డం యిష్టం. యిందులో ఏ ఒకటీ అందరికీయిష్టం కాదు. కాని...ప్రజాస్వామికంమీద అందరికీ మోజేనే–

కాశ్మీర్‌కోసరం కొట్లాడుకునే లియాకత్ నెహ్రూలు; అమెరికావిధానం 'మాకొంప ముంచుతోం' దనే బెవిన్, అదే 'సూక్ష్మంలోమోక్షం' అనే అచిన్‌సన్; అందరికీ ప్రజాస్వామికం ప్రియపాత్రమేనే !?–

ఇదేదో నానాత్వంలో ఏకత్వంలాంటి వేదాంతంలావుంది.

బహుశా... సినీమాస్టారేమో! ప్రతీఒక్క– 'శచటతప'కి కావాలనిపించే మంత్రిపదవేమో! కనీసం

యం. యల్. ఎ. నేమో! కాకపోతే సిమెంట్, ఇనుము పర్మిట్లలో ఏదేనాకావడానికీ అవకాశంవుంది. చివరకు బస్‌రూటు పర్మిట్ఐనాకావచ్చు. బ్లాక్‌మార్కెట్ అయి తీరుతుంది' —శీనాయిబుర్ర తెగబడ్డది.

'ఐతే వీటికివచ్చిన ప్రమాదమేమిటి?'

''ఏమీలేదు. కాబట్టి ప్రజాస్వామికంఅంటే యివేవీకావు.'' సమాధానపడింది.

ఐతే మరి...?

శీనాయి నాలుగుగోడలమధ్య కూర్చున్నాడు. తలుపులన్నీ మూశాడు. తెరిచాడు. ఆగోడనించీ యీగోడకు అడుగులు లెక్కపెట్టాడు. అంగలు పంగలు వేశాడు.

ఊహూఁ— తెమలలేదు.

ఒక్కవూపులోపోయి వూరివెలపల కాలవకట్ట మీద కూచోబడ్డాడు. నేలమీద గీతలుగీచాడు. కట్ట బీడీలు కాల్చివేశాడు. పెట్టె సిగిరెట్లు పీల్చివేశాడు.

ఊహూఁ — తెమలలేదు.

రఁయ్యినలేచాడు. సుడిగాలిలాపోయి సూరి ముందు వాలాడు.

యీ వాలకంచూచి భయపడ్డాడు సూరి.

''ప్రజాస్వామికం అంటే ఏమిటి?'' విసిరాడు. శీనాయి. ఏదోచెప్పబోయి నీళ్లు నమిలాడు సూరి. ''ప్రజా స్వామికం ప్రమాదంలో''

"అందుకే–" గద్దించాడు శీనాయి.

"అంటే–అంటే" యిప్పుడు నీళ్లు నెమరు వేస్తున్నాడు సూరి.

"అంటే అంటే కాదు. ప్రజాస్వామికం అంటే–"

"ఆఁ... ప్రజాస్వామికం అంటే ఎలెక్షన్లు. అంటే ఎన్నికలు— వచ్చే ఎన్నికల్లో ప్రజలంతా మాకు ఓట్లుయిస్తే –"

"యిస్తే–!" రెట్టించాడు శీనాయి.

"అప్పుడు తెలుస్తుంది ప్రజాస్వామికం—" చెప్పాడు సూరి.

"ఎన్నికల్లో –?–" ఎన్నికల్లో తుపాకీ మడమలు ఓటర్లకు యిరువైపులా కదంత్రొక్కడాన్ని గురించి ఆలోచిస్తుంది శీనాయిబుర్ర.

శీనాయి గిర్రున మడమత్రిప్పాడు. సూరి పిడికిలి బిగించి "ఒట్ ఫర్—" అరిచాడు. శీనాయి "సోషలిస్ట్" అనాలని, కాని—

శీనాయి మనస్సుతోపాటు పరుగెత్తలేని కాళ్లని యీడ్చుకుంటూ వెళిపో...తున్నాడు.

పోయిపోయి రామారావునిపిలిచాడు.

రామారావు అంతలావు అదేదో ఉద్గ్రంథంలో నించి కళ్లు పైకెత్తాడు.

"ప్రజాస్వామికమంటే ఏమిటి?"

"మనుష్యుల్లో ముందు భావవిప్లవంవస్తే—ఆనవ్యమానవులు ప్రజాస్వామికాన్ని—"

శీనాయిబుర్ర చిటచిటలాడింది. శీనాయి చిమచిమలాడాడు.

"నీకు బోధపడదు పో—" సెలవిచ్చి మళ్లీ పుస్తకంపేజీల్లో దూరిపోయాడు రామారావు.

అసలిది మనుషులకెవళ్లకి బోధపడేట్టు కన్పించలా శీనాయికి. బుర్రబరువుతో వంగిపోతోంటే—అలానే పోతూ పోతూ — ఎదురైన రంగాచార్యుల్ని అడిగాడు.

"ప్రజాస్వామికం అంటే ఏమిటి?"

"రైతుకాంగ్రెస్, కూలీకాంగ్రెస్, అంతర్జాతీయ రైలుప్రయాణీక కాంగ్రెస్... యింకా— దేవుడు మేలుచేస్తే —"

మరి ప్రజాస్వామికానికి ప్రమాదంఏమిటి?"

"ఓస్—అదా—? పభుత్వంలో వున్నవాళ్లు పర్మిట్లూ అవీయిచ్చి కాంగ్రెస్ఓట్లు కొనివేస్తున్నారే—అదీ! మాప్రజలకి ఒక్క-పర్మిట్టన్నా యియ్యడంలేదే- అదీ! చివరకు మాప్రజల్ని రాజకీయ బాధితులుగాకూడా ఎంచకుండాచేసి, ఐదెకరాలపొలం ఎగ్గొడుతున్నారే— "

శీనాయి చివరిమాటలు వినవేలేదు. ఎకాఎకీ పోయి గాంధీగారయ్య యింటిముందుపడ్డాడు.

“ప్రజాస్వామికం అంటేఏమిటి ?”

గౌరయ్య ఒక్కసారి యికిలించాడు. బొర్రి సవిరించాడు. ఆచేత్తోనే బొర్ర సవిరించాడు. గట్టిగా సకిలించాడు.

“యిప్పుడు మనకాంగ్రెస్ ప్రభుత్వం చేస్తున్నదే- అదే- అంతాఅదే-”

శీనాయి గిరుక్కునతిరిగాడు.

“కాంగ్రెస్ చేస్తున్న దేమిటి ?”

‘కార్డులకీ కవర్లకీ ఖరీదులు పెంచడమా ? 3వ తరగతి రైలుచార్జీలు పెంచి ఒకటోతరగతికి తగ్గించడమా ? ఊళ్ల పేర్లు మార్చడమా ? అధికలాభాలపన్ను ఎత్తివెయ్యడమా ? అమ్మకపుపన్ను పెంచడమా ? ఉన్న కంట్రోళ్లు తీసెయ్యడమా ? లేనికంట్రోళ్లు పెట్టడమా? పదహారూ, ఆరూ మధ్య రేషనింగ్ ఔన్సుల పరిమాణం ప్రయాణం చెయ్యడమా? ... వగైరా యివన్నీనా? యిందులో ఏఒకటన్నానా?...

దారం తెగిన గాలి పడగలా పోతున్నాడు. శీనాయి కాఫీహోటల్లో ఉదయంపూటదిగే ఇడ్లీవాయిల కంటే జోరుగా దిగుతున్నాయి. శీనాయిబుర్రలో ఆలోచన్లు-అడ్డమైనవాళ్లనల్లా అడుగుతున్నాడు.

“కాంగ్రెస్ చేస్తున్న దేమిటి ?”

"కల్లుసారాలమీద నిషేధం అనడం. మా పొట్టకు తిండి నిషేధంపెట్టడం." చెప్పాడు గౌడగణపాయి.

"కొనబోతే కొరివి. అమ్మబోతే అడివి" అన్నాడు ఓరైతు.

"జీవితప్రమాణం పెరగడం-జీతాలు తరగడం- చెప్పాడు ఓగుమస్తా—

"కూలీ పెంచండి! అంటే జైళ్లు, తుపాకులూ పెంచడం-"

యిలా... యిలా...

"యిదే ప్రజాస్వామికమైతే దీనికి ప్రమాదమొస్తే ఏం?" తర్జనభర్జనల్లో పడింది శీనాయిబుర్ర.

ఈ ఆలోచనవచ్చేసరికి శీనాయికి కాంగ్రెస్ ప్రభుత్వం జైళ్లూ తుపాకులూ విరుచుకుపడ్డట్టయింది — తనమీదే.

ఉహూఁ — యిదీ తేలలేదు. శీనాయికి ఏదైనా అంతే —

ఆవేళటి పత్రికల్లో మరోవిషయం కనిపించింది పెద్ద అక్షరాల్లో —

ఐతే... అవి తాటికాయలంతవున్నాయా? కొబ్బరికాయలంతవున్నాయా?' అని ఆలోచించడంతో కొంతకాలం వృథాఐపోయింది. ఐనా —

"కమ్యూనిజం ప్రజాస్వామికానికి పరమ

శత్రువు" అంటూన్న ఆ తాటికాయలు లేక కొబ్బరి కాయలు శీనాయి పరిశోధనకి బహుగా వుపయోగ పడేట్టున్నాయి. 'కమ్యూనిజం' అంటే ఏమిటో తెలిస్తే దానికి వ్యతిరేకమంతా 'ప్రజాస్వామికం' అని చెప్పేసెయ్యొచ్చు. అప్పుడు దానికొచ్చిన ప్రమాదాన్ని అట్టేకని పెట్టెయ్యొచ్చు. అందుకు అలాగ్గా నడుం కట్టెయ్యొచ్చు.

యిక "ప్రజాస్వామికం అంటే యేమిటి?" అన్న విషయం వదిలి "కమ్యూనిజం అంటే యేమిటి?" అని లంకించుకుంది శీనాయిబుర్ర.

కాని ఎవరి నడుగుతాడు —

మొదట దొరికే జైళ్లల్లోవున్నవాళ్లూ, తర్వాత దొరికే స్వర్గంలోవున్నవాళ్లూపోగా — యిక అసలు దొరకని కమ్యూనిస్టులకోసం వెతకాలి. ఐనా అంతలేసి మిలిటరీబడ్జెట్లకే అంతుదొరకనివాళ్ళకోసం ఆరాటపడటం వృధా అనుకున్నాడు. శీనాయి.

మరైతే...ఎలా?

అమాంతంగా శీనాయికి ఆ వూళ్లో కామేడ్ కోటిగాడు వూరేగింపుల్లోచించుకున్న గొంతువినిపించింది.

"ఆఁ! అదే కమ్యూనిజం." నిర్ధారణచేశాడు శీనాయి. "దానికి వ్యతిరేకమే ప్రజాస్వామికం–" తేల్చేసింది శీనాయిబుర్ర.

* * *

తిరిగ్గాకూచున్నాడు శీనాయి. స్థిమితంగా ఆ కేకల్ని నెమరుకు తెచ్చుకొంటోంది శీనాయిబుర్ర.

"అందరికీ తిండి కావాలి"

"అందరికీ బట్టకావాలి"

"అందరికీ పనికావాలి"

"దున్నేవాడికే భూమికావాలి"

"విశాలాంధ్రలో ప్రజారాజ్యంకావాలి"

"యిదీ కమ్యూనిజం" నిర్ధారణచేశాడు శీనాయి. ఐతే —

"అందరికీ తిండీ, బట్టా, పనీ అక్కర్లేదు"

"దున్నేవాడికి భూమి అక్కర్లేదు"

"విశాలాంధ్రలో ప్రజారాజ్యం అక్కర్లేదు"

"ఇదీప్రజాస్వామికం" తేల్చేసిందిశీనాయిబుర్ర.

"ఐతే— దీనికి ప్రమాదంవస్తేమాత్రమేం?"

శీనాయిబుర్ర తుకతుకలాడింది.

శీనాయి తుపానులా ఝుఁయ్యిమన్నాడు.

"ప్రజాస్వామికం అంటే యిదేమిటే? యిలా తయారయింది." జనం - కూడూ గుడ్డా, దున్నుకోడానికి చారెడు నేలా, చేనుకోడాని కింతపని కావాలంటారు.

"అంటే, నోళ్లు నొక్కేసి జైళ్లల్లో కుక్కేస్తామంటారు. వీరు —

తోంఖై

అయితే గియితే — తిండీ, గుడ్డా, భూమీ, పనీ కావాలనటం ప్రిజలంతా అంటారు. కనుక అది ప్రిజాస్వామికం కావాలి.

అదేఅయితే, యీ నోళ్లునొక్కే కాంగ్రెసూ, గాంధీ గారయ్య వగైరా వగైరాల చేతుల్లో — ప్రిజా స్వామికానికి నిజంగానే ప్రిమాదం వచ్చింది.

"అరె! ప్రిమాదం తెచ్చేవాళ్లే 'ప్రమాదం, ప్రిమాదం' అని తెగఅరుస్తారేం!"

యిది — దయ్యాలు వేదాలువల్లించడమా?

తుపాకీలు అహింస జపించడమా?

యిప్పుడు శీనాయి సీరియస్ అయ్యాడు.

అలా అలా- 'కిమ్మ'నకుండా తిరుగుతున్నాడు. 'కిమ్మ'ంటే కమ్యూనిస్ట్ అంటాయేమో గాంధీటోపీపెట్టు కున్న తుపాకీలు — అన్న భయంతో —

---

# గోరీల దొడ్లో

సామిగాడు తెలుగువాడు.

'కడుపులో బంగారు - కనుచూపులో కరుణ చిరునవ్వులో సిరులు - తొణకించు నా తల్లి'...—అని కవులకలాలు కళ్లుమూసుకునిపాడిన తెలుగుతల్లి గర్భాన్నే పుట్టాడు.

'బంగారు పంటలే పండుతాయి-' అన్న తెలుగుతల్లి ఒడిలోనే పెరిగాడు.

సామిగాడి అసలుపేరు స్వామి. ఐతేనేం! అలా ఎవరూ పిలవరు. రెండక్షరాలు పొడుగైనా "సామిగాడు' అనే అంటారు.

జీవితంలో అధికభాగం — దాదాపు అంతా కూడా, బంగారుపంటలమధ్యలోనే గడిచింది. అంతులేని ధాన్యరాసులు అతని చేతిమీదగానే గాదెలకెక్కాయి. ఆ వూళ్లో అనేకవందల పశువులు అతని చేతికిందే పెరిగి పెద్దవయ్యాయి. ఎప్పుడో ఓసారి, మొత్తంమీద, కలిగిన వాళ్ళందరి పొలాలూ, సొత్తులూ ఎవరోవొకరి వాటిని "మా పొలం - మా గొడ్లు" అని పిలిచే వుంటాడు.

ఐతేనేం? అతను 'నా' అని చెప్పుకోవలసివస్తే మాత్రం ఓచిన్న చుట్టు గుడిసె— గంపెడు సంసారమూ మిగులుతాయి.

ఆవూరి కలిగినవాళ్ళల్లో స్వామిమంచిపేరే సంపాదించుకున్నాడు. అందరికీ అతని మీదే చూపు. ఏరువాక పున్నమ యింకా రెండు నెల్లుందనగానే అంతా ఆతనితో గుసగుస లాడేవాళ్ళే.

అందతా —ఎంత కష్టానికైనా ఓర్చి ఏనుగలాపనిచేసే ఆతనిదేహం; పనిమీద, ఆసామీ మీదా గలభక్తితో నిద్రకూడా లొంగని అతని గుంటకళ్ళూ;ఏ పాచిపోయిన కూడైనా మాట్లాడకుండా తినే ఆనోరూ; ఎన్నిబూతులకైనా ఎదురుతిరగని అతని మానసికతత్వం వాటిదే ఆ గొప్పతనం. అంతా స్వామినే కోరే దందుకే.

మొదట్లో అసలితగాణ్ణి పనిలోపెట్టుకుంటామన్న వాళ్లేలేకపోయారు. అరేళ్లైనా వెళ్ళని సామ్మిని వెంటేసుకుని వాళ్ళబాబు ఎన్నిగడపలెక్కి—ఎన్నిదిగాడో లెక్కలేదు. 'ఇంతకూడువేసి చేయించుకోండి' అని ఎందరి కాళ్ళా వ్రేళ్ళాపడ్డాడో చెప్పడంకష్టం. ఆగంపెడుబలగంలో ఒకడు తగ్గినాతగ్గినట్టేనని నానాఅవస్థలూపడ్డాడు. మొదటగా స్వామిని పనిలోపెట్టుకున్న ఆ ఆసామి ఆ కుటుంబానికి దేవుడే ఐపోయాడు.

ఆనాటినుంచీ ఆ చిన్నతనంలోనే స్వామి

ఒళ్ళు ఎన్నోసార్లు కర్ర దెబ్బలకు కండెలుకట్టింది. యికవంటిమీద తెగినత్రాళ్ళు అన్నీయిన్నీకావు. ఏమాటచివరా 'లంజాకొడకకా' అన్న వూతపదంలేకుండా వాడిందేలేదు.

మొదటిసారి దెబ్బలుతట్టుకోలేక పారిపోయి గుడిసెలోపడిఏడ్చాడు. అమ్మతో 'నేనికపోనేపోన'ని మొత్తుకున్నాడు. కాని —అవిచాలపన్నట్టు బాబుకూడా మళ్లీ కొట్టుకుంటూ ఆఆసామికే అప్పగించాడు. పైగా 'లంజాకొడుకుని బాగాతన్నండి' అన్నాడు. యివన్నీ పనినేర్పడానికట. యింకదిక్కేది?

మరోసారి పారిపోయి మూన్నాళ్లపాటు జొన్నచేలను దిక్కుచేసుకున్నాడు. తిండిలేకుండా అలాఎన్నాళ్లు..?

ఒకసారి ఎక్కడో గోలీలఆటచూస్తూ నిలబడ్డాడని వీపు పెట్లిపోయింది. యింకోసారి గారడీఆటకువెళ్లినందుకు ప్రిర పగిలిపోయింది. మరోసారి ఆ యింటివారి అబ్బాయి ఏదోతింటుంటే నిలువుగ్రుడ్లతో 'దిష్టి'పెట్టాడని వొళ్లంతా వాచిపోయింది. ఏరోజూ అసలు నిద్రలేపడమే దెబ్బలతో తన్నులతో—

తన్నులూ, గుద్దులూ, వీటన్నిటినీ మించి ఆబెత్తెడు లేతపొట్టకీ అకలిసమస్యా—యివన్నీ అతడిలోని స్వేచ్ఛాతత్వాన్ని ఏమారుమూలలకో. అణగద్రొక్కాయి. క్రమంగా అసామీల యిష్టాయిష్టాల ననుసరించే తనజీవి

తాన్ని వంచుకొచ్చాడు. అందుచేతే – అందరుషావుకార్లు 'సామిగాడు మాక్కావాలంటే–మాక్కావాలి' అనే అంతగా వంచుకొచ్చాడు.

ఎంతోమంది యజమానులు మారారు. స్వామి కూడా వయస్సులోనూ ఆకారంలోనూ మారుతూనే వచ్చాడు. ఒక్కొక్క ఏడే పైబడ్డకొద్దీ–అంతకుమించిన పనులుకూడా మీదపడుతూనేవచ్చాయి.

ఊడ్పులకాలంలో చేలగట్లన్నీ చెడతిరుగుతూండేవాడు. రాతింబగళ్ళు, చినుకుల్లో, చిత్తడిలో, కాలవగళ్ళకీ, తూములకీ కాటికాపలా కాస్తూండేవాడు. నూర్పిళ్ళకాలంలోరాత్రి 10గంటలకు నడుంవాలుస్తాడు. మళ్ళా 3గంటలకే పోయికూలీలమీదపడేవాడు. వర్షాకాలంలోకూడా గొడ్లను మేపుకుంటూ 'తాళ్ళోతంకరో'పేనాలి. గాంధీగారి ఆదేశానుసారం దంపుడుబియ్యానికి వడ్లుదంచాలి. ఇకఏకాలమూ తనసంకటికి మొక్కజొన్నలు తొక్కుకోటంవుండనేవుంది. 360రోజులూ 16 గంటలన్నా ఏదోపని–ఎక్కడోఓచోట.

'స్వామిగాడు, మంచివాడు' గదూ!

యీమంచిపేరు అరగతోమించుకోడానికి తప్ప ఎందుకూ పనికిరాకపోయినా– పెళ్ళాందొరకడానికిమాత్రం పెద్దమంత్రలాగానే పనిచేసింది.

యిరవైరెండోయేట పదిహేనునాగాలూ, యీ

భైరూపాయల అప్పుతో స్వామి పెళ్ళాం ఆచుట్టుగుడిసెలో ప్రవేసించింది.

ప్రవేసించడమేనా? అమరోయేటినుంచి యేడాదికీ రెండేళ్ళకూ ఒకళ్ళుగాసంతానంతో ఆగుడిసె చాలకుండా చేసేసింది. పుట్టీపుట్టడమే పొట్టబట్టుకుని గుట్టలు పట్టాల్సిన పాపలసంఖ్య పదిదాకా పెంచేసింది.

ఏరష్యాలాంటి దేశంలోనో ఐతే ఈ సంతానం-దేశానికీ, వాళ్ళకూకూడా లాభం. కాని యీ బలగం యీ దేశంలో ఆకలితో చావడానికి మినహా యెందుకు?

గాంధీగారు ఎప్పుడో అన్నాడట 'హరిజనుడే మన రాజ్యం ఏలుతాడ' ని. ఆ విషయం ఓ భూస్వామి దగ్గర విన్నాడు. స్వామి దాన్ని నమ్ముకొన్నాడు. స్వామికున్న యీ అసలు ఆశకాస్తా నెరవేరితే-యిక మిగతా చిన్న చిన్న వాటికేమిటి?

ఎలాగైనాసరే. తాను ఏమైపోయినామానె. పిల్లల్ని చదివించితీరాలనుకున్నాడు. తంటాలుపడి పెళ్లాన్ని ఒప్పించాడు.

కాని—పెళ్ళాని కప్పుడప్పుడూ యీ చేతగాని పనికి కోపం వచ్చేది. అందరి పిల్లలూ ఏ అయ్యాదగ్గరో వాళ్ళ పొట్టలు వాళ్లు పోసుకుంటుంటే, తమ పిల్లల్ని కూచోబెట్టి మేపడం. పైగా పలకలనీ పుస్తకాలనీ—

స్వామి పెళ్ళాంకూడా చాకిరీలో మొగుడి

కేమీ తీసిపోయేరకం కాదు. పని దొరికినంతలో ఏమీ వృథా పోనిచ్చేదికాదు. ఇక్కడ పనుల్లేని కాలంలో ఏ వేరుశనగ కోతకో ఓ నెల పోయివచ్చేదికూడా. ఐనా ఆ సంసారానికి దంతా ఏమూలకి ......?

స్వామి తెచ్చే జీతం వంద, నిత్యాభత్యం మూడు తవ్వాలుకూడా ఏ ముక్కులోకి?

యుద్ధమంటూ పెరిగినధరలకు ఆ సంసారం మరింత క్షణగండ మయింది. మంచితనాన్ని ఉపయోగించి ఓ ఎకరం కౌలుకు పుచ్చుకుంటే అదీఅంతేఅయింది. పగలల్లా పెళ్ళామూ, ఆసామీ పనంతా ముగించి రాత్రి తానూ, చేలో దిగేవాళ్లు. వెన్నెలలో ఒక్కడే ఎండుగడ్డ దున్నేవాడు. గడ్డపని చేసేవాడు. పెళ్ళాం బిడ్డల్ని అడ్డం పెట్టుకుని రాత్రిలురాత్రిలూ కుప్పవేసేవాడు. నూర్చేవాడు. రెండేళ్ళభాగోతమూ — 18 బస్తాలు కౌలుపోను మిగిలినదానికంటే తగలడమే మిగులయింది...

పెద్దకొడుక్కి స్కూల్లోచదువుకాస్తా అయిపోయి బస్తీకెక్కాల్సివచ్చింది. అక్కడ ఆ చదువుకు జీతంచెల్లించాలట. పొట్టకీ, బట్టకేకాక పుస్తకాలుకూడా కొనాల్సివచ్చినందుకే తనపని మూలిగేనక్కమీద తాటికాయలా వుంది. జీతంకూడా కట్టాలంటే — ఎలా?

ఎవరో ఓ పుణ్యాత్ముడు ఓ ఉపాయంచెప్పి పుణ్యంకట్టుకున్నాడు.

'క్రిష్టియన్ మతంపుచ్చుకుంటే పిల్లవాడి చదువుకు జీతంచెల్లించనక్కర్లేదట'

ఏ మతమైతేఏమో! పేదవాళ్ళకందరికీ జీతాలు తీసే శేదానికి ——

తెల్లవాడిరాజ్యంకాదూ? పాడు రాజ్యం. యిట్లా యిర కాటానబెట్టి మతం మార్పించడం ఎందుకో?

పెళ్లాన్ని పెటపెటాలమీద ఒప్పించాడు. ఓ ఆదివారంనాడు స్వామికాస్త్రా సాలమన్ ఐపోయాడు. ఒక పాపి ఆత్మను పరిశుద్ధంచేసి కోడిపెట్టా, బియ్యపుమూటతో సంతృప్తిపడ్డాడు ఫాదరీ.

ఆ ఫాదరీగారి పడి పంచలు కాసి ఎలాగైతేనేం? పిల్లవాణ్ణి బోర్డింగులోచేర్పించాడు. కళ్లన్నీ తెరచుకుని గాంధీగారి కాంగ్రెస్ రాజ్యంకోసం ఎదురుతెన్నులు చూస్తున్నాడు. యింటిదగ్గరున్న ఏకొద్దిక్షణాలైనా పెళ్లానికదే చెబుతుంటాడు. హరిజనుడే రాజ్యంఏలేసంగతి నూరిపోస్తుంటాడు. మింగుడుపడుతున్నదో లేదోకూడా పట్టించుకోకుండానే.

స్వామి—కాదు కాదు, 'సాలమన్' అచ్చగా 24 గంటలూ ఆ ఆసామీల వాతావరణంలో తిరుగుతుంటాడు. పైగా వాళ్ళ యిష్టాలకు అనుగుణ్యంగా తన యిష్టాలను మార్చే 'మంచివాడా'మెను. అందుకే తన తోటివాళ్ళ కెవరికీ లేని నమ్మకాలు.

మొదటిసారిగా ఆవూరి పాలేర్లంతా మీటిం గుకు పిలిస్తే సాలమన్ పోనేలేదు.

"అబ్బో! మీకందరికీ జీతాలు పెరిగితే నాకూ దానంతటదే పెరుగుద్దిలే" అంటూ వెకిలిగా దులపరిం చుకు పోయాడు.

అంతా సమ్మెచేస్తుంటే సాలమన్ మాత్రం ఆ మూడు రోజులూ ఆసాములతో 'చుట్టాలింటికి చూపు కెళ్తున్నా' నని చెప్పిమరీ పారిపోయాడు.

రెండోయేడొచ్చేసరికి చాలా మార్పులు జరి గాయి. హరిజనులు రాజ్యంచేసే గాంధీగారి రాజ్యం రానేవచ్చింది. ఆ వూళ్ళో జరిగిన వూరేగింపులో ఎడ్ల ముందు తాళ్లు పట్టుకుని సాలమనూ వూరేగాడు. ఊరి మధ్యనే గాంధిగారి బొమ్మకూడా పెట్టారు. ఆ బొమ్మ పెట్టిన నాయకుడు వాళ్ళ ఆసామీ యింట్లోనే మకాం పెట్టాడు.

మొదటిసారిగా—యింట్లో నీళ్లుతేవడం, పక్కలు వేయడం అంతా సాలమన్‌కు అప్పగించారు. ఆవేళనించీ సాలమన్‌కు పొలంరాజ్యానికి తోడు యింటిరాజ్యంకూడా కలిసిన చాకిరీతో—హరిజనుడిమీద రాజ్యంవచ్చిపడ్డంత బరువూ ఎక్కింది.

ఈరెండురాజ్యాలతోనూ అతడికి తీరికేలేకుండా పోయింది. అయినా ఏదో తనలాంటివాళ్ళ రాజ్యం

రానేవచ్చిందన్న దిలాసాలోపడ్డాడు. ఈ మధ్యనే పాలేర్ల మీటింగుల్లోకికూడా అడపాదడపా పోతూవస్తూవున్నాడు. వీటన్నిటివల్లా — చిన్నప్పుడెప్పుడో అణిగిమణిగి అలా అడుగునపడివున్న స్వేచ్ఛాతత్వం పైకిరావడానికి గింజు కొంటోంది.

ఎడ్లకుపెట్టే గుగ్గిళ్లబుట్టలు, వుచ్చబట్టే కుండ లతోపాటే—చావిట్లో వంకెలను వ్రేలాడే పాలేళ్ళ అన్నపు గిన్నెలు, ముంతలూ, నిత్యమూ వెక్కిరిస్తున్నాయి—సాల మన్ హరిజన రాజరికాన్ని—

ఈ రాజ్యం రావడమే తనకొడుకు చదువుకు జీతం కట్టమన్నారు. 'హరిజనుడు అయితే పిల్లవాడి చదువుకు జీతం చెల్లించనక్కర్లేద' ట — ఏమతమైతేనేమో! పేదపిల్లలకందరికీ జీతంలేకుండా చదువుచెప్పించేదానికి —

మళ్ళీ మతంమార్చుకోవాలట. హరిజనుడు కావాలట.

దీన్ని 'పాడురాజ్యం' అనలేకపోయాడు. కాని తాను కలలుగన్న రాజ్యంవచ్చినా పరిస్థితులు పాడుగానే వున్నాయి. తన ఆశలుమాత్రం బీడుల్లాగా అలా అలా పెరుగుతూనే వున్నాయి.

మామ మొత్తం సంసారాన్నంతా వేసుకొచ్చి యీకొత్త గుడిసెమీద పడ్డాడు. వాళ్ళవూళ్లో రూపాయి

కూలీ కావాలని అన్నందుకు ఆసామి, కాంగ్రెసు, పోలీ సులు, గూడెం మొత్తాన్నీ చితకపొడిచి వదిలారట.

అదుగో అక్కడ – ఇదిగో యిక్కడ. ఎక్కడెక్కడో ఏవేవో గొడవలు.

ఈ రాజ్యంవస్తే అందరికీ స్వతంత్రం అందరికీ సుఖం అన్నారే? అదంతా ఏమైపోయింది. పంచ భక్ష్యాలూ, పరమాన్నాలూ వద్దనేవద్దు. పస్తులు లేకుండా బ్రతికేందుకేనా నోచుకోలేదా? జీతాలు పెంచమంటే పోలీసుల్ని తెస్తారా? పెంచకపోతేమానె తగ్గిస్తారా? ఆ తక్కువజీతాలకురాకపోతే పోలీసులువస్తారా? ఎందుకు? కనీసం "యీ జీతాలకు మేంరాం" అనడానికీ మానుకో డానికీకూడా నోచుకోలేదా? అయితే యీ రాజ్యంఎవరికి?

ఈ ఊళ్ళోకూడా షావుకార్లంతా కూడబలు క్కున్నారు. యీసారి జీతాలు పెంచమంటే పోలీసుల్ని తెస్తారట. ఒకనాడు చెప్పనేచెప్పారు. 'పెంచమనడం గాదు, నిరుడుపెంచిన పాతికలు ఈఏడు కోస్తాం, వస్తారా? రారా?' అని.

'వచ్చి కూటికిమాడి ఎవరు చస్తారు?'

'రాకఆపోలీసు పోట్లక్రిందఎవరుబ్రతుకుతారు?'

సాలమన్ ఆవేళే మొదటిసారిగా నోరు తెరి చాడు. 'యిటు తిండికి లేకై తేనేం—అటుదెబ్బలకైతేనేం ఎలాగైనా చస్తాం.'

అదే మొదలు మూగగొంతు విప్పుకొంది.

ఎన్నడూ లేని నోరు విప్పుకోడం షావుకార్లకు మరింత కోపకారణమయింది. సాలమన్‌మీద భగ్గుమం టున్నారు.

"యీ చేతులు చూచావా? పాతికేళ్ళంటే పాతికేళ్లు—ఆ దొరలకు చాకిరీ చేసిపెట్టాయి. యిప్పుడీ చేతులకే జోళ్లు వేయిస్తారట"

"బిడ్డలకూడా అట్లాచేసుకోం"

"ఆబిడ్డలూ ఆళ్ళకే చేయడమాయె"

"ఇక అట్టాఐతే కుదరదబ్బా"

మీటింగులుజోరుగాసాగుతున్నాయి. తక్కువ జీతాలకెవ్వరూ పోరుట.

"ఎంత పొగరెక్కినాయి? పుట్టినప్పట్నించీ మనకాడ పొట్టబుచ్చుకుని బతికిన వీళ్ళకి యింత దిమాగ్గా"

"యీళ్లు అడిగినంతా యివ్వడానికి యీళ్ళ తాతగాడిముల్లె దాచిబెట్టారా?"

"బతకలేరు వెధవలని చూస్తుంటే—"

"ఎంతకైనాసరే యింకెవళ్ళనన్నా తేవాల్సిందేగాని — యీళ్ళకిమాత్రిం జీతాలుకోసెయ్యాలి."

అంకిని 'అంకమ్మా' అంటే మరోసారి పిలవ మండట—"

షావుకార్లు భగ్గుమంటున్నారు. నిరుటిజీతాలు

తగ్గించి తీరాలట. యింతా అని జీతం అడగరాదట. యిష్ట మొచ్చినంత యిస్తారట.

*　　*　　*

"ఏరా? యేం తేల్చుకున్నారు?"

"తేలేందు కేముందండీ! ఎప్పటిమామాలేగా?"

"ఏమిటా మామూలు?"

"మీ రెరుగం దేముందండీ? నిరుడిచ్చిన జీతా లేనా? కాళపోతే ఎవడేనా ఎదిగినాడుంటే కాస్త ఎక్కువడుగుతాడు"

"మీరడిగినంతా యియ్యడానికి యిక్కడ దాచబెట్టారా?"

"ఎవరన్నారండీ! మేమడిగినంతా యియ్యడానికి మీరు దాచబెట్టనూ లేదు; మీరు రమ్మన్నంతకే రావడానికి మీరు మమ్మల్ని పోషించడమూ లేదు."

"ఏం కూశావురా?"

"ఉన్న దేగదండీ అన్నాను–"

"మా యిష్టమొచ్చినట్టు యిస్తాం"

"మా యిష్టమైతే వస్తాంగదండీ."

"ఒహో! ...ఒరేయ్ నూకలుంటే కాకులు కావలసినన్ని రా–"

"కాదంటండీ– రెక్కలాడితేనే– నూకలున్నా"

"అంత మిర్రుగా వుందన్న మాట... చూస్తాం–"

"ఎవరి మిత్రు ఎవరి కొస్తదండీ – మా పాప మిట్లా పండి మనుషులం మార్కెట్టులో సరుకులాగా అయిపోయాం. అంతా బేరమే. మీకు యిష్టమైతేకొంటారు; మాకు యిష్టమైతే అమ్మతాం. అంతేనా?"

"ఎట్టా రారో చూస్తాంగా. పరిక్కవాళ్ళల్లో చూస్తన్నరా?"

"మాకు యిష్టంలేకపోతే మా చేతెవరు పని చేయిస్తారు–? అదీ చూద్దాం..."

*   *   *

రోజులు గడుస్తున్నాయి. ఎక్కడా ఒక్కజీత గాడులేడు. పొరుగూళ్లనించి ఎంతకూ ఎవరూ రావడం లేదు. భవంతుల్లోని అసూర్యంపశ్యలు ఆడవాళ్లు మొదట్లో మొగుళ్లమీద విసుక్కొని, తర్వాతగొణుక్కొని యిప్పుడు పెద్దగానే తిట్టిపోస్తున్నారు. బొబ్బలుపొక్కు తున్న చేతులూ, కారుతున్న చెమటలూ, కందుతూన్న ఒళ్లూ చూస్తుంటే మగాళ్లకీ కష్టంగానేవుంది. కాని తీరా యింతఅయ్యాక లొంగితే—?

అమ్మో! తలగుడ్డలు పడిపోవూ?

రోజులు గడుస్తున్నాయి. వాళ్లూ వస్తులుంటు న్నారు. కానిలొంగరే–తీరా యింతఅయ్యాక లొంగితే–?

నీళ్లగంజికూడా లేకుండా అరవచాకిరీచేయించు కుంటారు. అలైనా యిలైనా చావు చావే.

పోలీసులకి రిపోర్టులు పోతున్నాయి. వూళ్లో దుండగీళ్లు బయల్దేరా రట, పోలీసులచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. వూరుచుట్టూ దుండగీళ్లేనట. పోలీసుల ముందు వలవలామంటున్నారు. తమ ధనమానప్రాణాలకి రక్షణలేదట. ఋజువులు చూపెడ్తున్నారు. ఒక్కకూలి వాడూ పనికిరావడంలేదట. ఎంతబడితేఅంతకూలి అడుగు తున్నారట. చాకిరీచెయ్యడమెందుకు దోచుకుపోతామం టున్నారట—

కూలివాడు పనికిరావడంలేదంటే—? వాడి యిష్టమైతేవస్తాడు;ఎంతబడితే అంత అడుగుతున్నాడంటే—? అంతా యిచ్చినవాళ్ళకే పోతాడు. ఇందులో పోలీసులు చేసేదేముంది! దోచుకుపోతారా — దోచుకోకముందే ఎవరిని పట్టుకోడం—? మామూలు పోలీసులకిందులో ఏముందో తోచలా?

కూలివాడు పనికిరానంటున్నాడూ? వుత్పత్తిని కుంటుబరచచూస్తున్నాడన్నమాట.ఎంతబడితేఅంత అడుగు తున్నాడూ? పనిని స్థభింపజేసి దేశీయ సంపదని పాడుజేసి తద్వారా ప్రభుత్వాన్ని చిక్కుల్లోబెట్టి పడదోయబోతు న్నాడన్నమాట. యిది చట్టధిక్కారం. తిరుగుబాటు — తప్పకుండా దోపిడీలు సాగిస్తారు — తోచింది చెప్పాడు పోలీస్ ఆఫీసరు.

పోలీసులు హుటాహుటీవచ్చిదిగారు. అందిన

వాణ్ణి అందినట్టల్లా పేలేటిగేట్టు కొట్టిపోయారు. ఎవర్నీ ఏమీ చెప్పుకోనివ్వలేదు. పోతూపోతూ ఆఫీసరుమాత్రం చెప్పాడు.

"రెండురోజుల్లో మళ్ళీవస్తాం. అంతా పిల్లా పీచుతోసహా పనుల్లోకివెళ్ళాలి. లేకపోతే—"

ఆ రెండురోజులూ గడిచాయి. ఒక్కరూ పనుల్లోకిపోలేదు. ఎవడన్నా పోదామనుకున్నా కాళ్ళూ కీళ్లూ ఒళ్లూ అతగాడి స్వాధీనంలోవుంటేగాదూ?

షావుకార్లకు మరింత కోపం వచ్చింది. మర్ధనంవల్లకూడా గుణవర్ధనంకాలేదంటే యేమిటి? పోలీసు కాంపుకుపోయి బావురుమన్నారు. ప్రాణభిక్షపెట్టమని ప్రాధేయపడ్డారు. ప్రాణం మినహా మానం నీదేనన్నారు.

ఆఫీసరు మండిపోయాడు. లారీలు రణగొణ ధ్వనిచేస్తూ బయలుదేరాయి.

సాలమన్‌కు పిచ్చెత్తినట్టయింది. ఇదేమిటి? ఇదేమి హరిజనరాజ్యం. యీసారి పోలీసులొస్తే తేల్చుకోవాలి.

పోలీసులువచ్చేసరికల్లా వూరుమధ్య తనవాళ్లని పోగుజేసి ముందునిలబడ్డాడు. చెప్పుకోవలసిందంతా చెప్పుకోవాలి. అన్యాయాన్ని బద్దలుచెయ్యాలి. షావుకార్లని నిగ్గదీసి అడగాలి—పోలీసులకి చెప్పుకోవాలేగాని న్యాయం జరిగితీరుతుంది.

లారీ ఆగడమే పోలీసులు చుట్టుముట్టారు. పారి పోడానికూడా వీలుదొరకకుండా చక్రబంధంలోపడ్డారు.

లారీలో ముందుసీటులో ఆఫీసరుతోపాటు కూచున్న షాహుకారు గొల్లుమన్నాడు.

"సమయానికి తమరు దయచేశారు. లేకపోతే యీజనం ఏమయినా చేసివుందుర''ని-

సాలమన్‌కు దిక్కుతోచడం లేదు. గుంపు మొత్తం ఛేదించబడుతోంది. కీళ్లుతొలుగుతున్నాయి. తలలు పగుల్తున్నాయి. రక్తాలు కారుతున్నాయి. కాకిగోలగావుంది. కుప్పల్లా ఒక్కొక్కరే కూలబడిపోతున్నారు. ఏమిచెయ్యడం ? ఏమీచెప్పుకునేందుకూడాలేదే ?

లారీలోవున్న ఆఫీసర్ని చూచాడు. ఒకవైపున మీద దెబ్బలుపడుతోన్నా లెక్కచెయ్యకుండా లారీవైపు పరుగెత్తుతున్నాడు. ఆయనతో చెప్పుకుంటాడు. ఆయన కాళ్లు పట్టుకుంటాడు. నిజాన్ని బయటికితేవాలి. తన జనం కోసం ఏదైనాచేస్తాడు. నిజంకోసం ఏమైనా అవుతాడు. అదే అతని ఆరాటం. పరుగెత్తుతున్నాడు లారీకేసి...

లారీలో కూచున్న షావుకారు కెవ్వున కేక బెట్టాడు. 'తనని చంపవస్తున్నా'డని —

లారీలో కూచున్న ఆఫీసరు సరిగ్గా కాల్చాడు. శరణన్న షావుకారి ప్రాణం రక్షించేందుకు-

పోతూన్న సాలమన్ అక్కడికక్కడే విరుచుకు పడి గిలగిలా తన్నుకున్నాడు. ప్రాణమూ, దానితోపాటు అతను బయటికి తేదలుచుకున్న న్యాయమూ, రెండూ గాలిలో కలిసిపోయాయి.

అతడితోపాటే - హరిజనులు రాజ్యంచేసే అతగాడి అసలు ఆశ, తన పిల్లల చదువు సంధ్యలకోసరు ఆశలూ మట్టిలో కలిసిపోయాయి.

ఆ గోరీలదొడ్లో - అన్నిగోరీలమధ్య తలెత్తి నిటారుగా నిలబడ్డ ఆ రాతిపలక-

'సాలమన్ ప్రభువునందు నిద్రించెను' అనడానికి బదులు...

'నీఆశయం మేం నెరవేరుస్తాం'

—అంటూ పీడిత ప్రజాహృదయాల్లో ప్రతిక్షణం ప్రజ్వలింపజేస్తుంటుంది.

---

# అంతరాత్మ

# అంత్యక్రియలు

## (కధానికా సంపుటి)

రచన:

బొల్లిముంత శివరామకృష్ణ

ఇందులోని కథలన్నీ ప్రధానంగా రామరాజ్యపు నగ్నసౌందర్య ప్రదర్శన దినాలలోని ఆంధ్ర ప్రజా జీవితాన్ని ప్రతిబింబించుతున్నాయి. ఉక్కు-చటాంలతో "ఆ" అంటే "ఢాం," "ఊ" అంటే "ఢాం" అనే ఆ గడ్డురోజుల్లో సాహిత్యం ప్రజా జీవితాన్ని ప్రతిబింబించడానికి కావలసిన వ్యంగ్యాత్మక కథా రచనలో నిగ్గుదేరిన కథా రచయిత మీముందుంచిన ఆంధ్రజాతి జీవితమే యీ సంపుటి—

లక్ష్మి ఆర్టు ప్రింటర్స్, కొత్తపేట, గుంటూరు-1.

# చదవండి

| | |
|---|---|
| చరిత్రహీన్ - శరత్ | 4- 0-0 |
| సుక్షేత్రం - పెరల్ బక్ | 4- 0-0 |
| సింహగర్జన - లక్ష్మీకాంత మోహన్ | 2- 4-0 |
| కల్పన (కవితాసంపుటి) | 4- 8-0 |
| కొడుకులు - కూతుళ్ళు | 5- 0-0 |
| రైతుబిడ్డలు - (కొడాలి గోపాలరావు) | 1- 0-0 |
| సమ్మె పిలుపు | 0-10-0 |
| చైనా అరుణ తార | 3- 0-0 |
| సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ సూత్రాలు | 0- 6-0 |
| బొల్లిముంత శివరాం కథానికా సంపుటి - (మేలుప్రతి) | 5- 0-0 |

ప్రతులకు

**నవయుగ బుక్ హౌస్**

బ్రాడీపేట : : గుంటూరు.

Wrapper Printed At Swatantra Art Printers, Vijayawada-2